శ్లో॥ నిమిషార్ధంనతిష్ఠంతి। వృత్తింబ్రహ్మమయీంవినా।
తథాతిష్ఠంతిబ్రహ్మాద్యాః। సనకాద్యాశ్శుకాదయః॥౧౩౪॥

శ్లో॥ కార్యకారణతాంయాతా। కారణేనహికార్యతా।
కారణత్వంతతోనశ్యేత్। కార్యాభావేవిచారతః॥౧౩౫॥

శ్లో॥ అథశుద్ధంభవేద్వస్తు। యద్వైవాచామగోచరం।
ద్రష్టవ్యంమృద్ఘటేనైవ। దృష్ట్వాతేనపునఃపునః॥౧౩౬॥

శ్లో॥ అనేనైవప్రకారేణ। వృత్తిర్బ్రహ్మాధికాభవేత్।
ఉదేతిశుక్లచిత్తానాం। వృత్తిజ్ఞానంతతఃపరం॥౧౩౭॥

శ్లో॥ కారణవ్యతిరేకేణ। పుమానాదావిలోకయేత్।
అన్వయవ్యతిరేకాభ్యాం। కార్యంనిత్యేప్రకాశతి॥౧౩౮॥

శ్లో॥ కార్యేహికారణంపశ్యే। త్పశ్చాత్కార్యంవిసర్జయేత్।
కారణత్వంతతోగచ్ఛే। దవశిష్టంభవేన్మునిః॥౧౩౯॥

శ్లో॥ భావితంతీవ్రయోగేన। యద్వస్తునిశ్చయాత్మనా।
పుమాంస్తద్వద్భవేచ్ఛీఘ్రం। జ్ఞేయంభ్రమరకీటవత్॥౧౩౯॥

శ్లో॥ అదృశ్యభావరూపంచ। సర్వమేతచ్చిదాత్మకం।
సావధానతయానిత్యం। స్వాత్మానంచైవభావయేత్॥౧౪౦॥

శ్లో॥ దృశ్యంహ్యదృశ్యతాంనీత్వా। బ్రహ్మాకారేణచింతయేత్।
విద్వాన్నిత్యంసుఖంతిష్ఠే। ద్ధియాచిద్రసపూర్ణయా॥౧౪౧॥

శ్లో॥ ఏభిరంగైస్సమాయుక్తో। రాజయోగఉదాహృతః।
కింత్యక్తవిషయాణాంచ। హఠయోగేనసంయుతః॥౧౪౨॥

శ్లో॥ పరిపక్వంమనోయేషాం। కేవలోయంనసిద్ధిదః।
గురుదైవతభక్తానాం। సర్వేషాంసులభోజయత్॥౧౪౩॥

శ్లో॥ తీర్థే వా శ్వపచగృహే వా । నష్టస్మృతిర్వాపరిత్యజేద్దేహం ।
జ్ఞానఫలకాలసమయే । కైవల్యం యాతి విగతశోకః॥౧౪౪॥

శ్లో॥ రథ్యాంతరే మూత్రపురీషమధ్యే । చాండాలవేశ్మన్యథవా శ్మశానే ।
కృతప్రయత్నోహ్యకృతప్రయత్నో । దేహావసానే లభతే చ మోక్షం॥౧౪౫॥

శ్లో॥ అతివాదాం స్తితిక్షేత । నావమన్యేత కించన ।
న చైవ దేహమాశ్రిత్య । వైరమన్యేన కేనచిత్ ॥౧౪౬॥

శ్లో॥ నకుర్యాన్న వదేత్కించి । న్న ధ్యాయేత్సాధ్వసాధు వ ।
ఆత్మారామతయా వృత్త్యా । విచరేజ్జడవన్మునిః॥౧౪౭॥

శ్లో॥ అకించనస్య దాంతస్య । శాంతస్య సమచేతసః ।
సదా సంతుష్టమనసః । సర్వాస్సుఖమయా దిశః॥౧౪౮॥

శ్లో॥ నిర్వాసనో నిరాలంబః । స్వచ్ఛందో ముక్తబంధనః ।
క్షిప్తః సంస్కారవాతేన । చేష్టతే శుష్కపర్ణవత్ ॥౧౪౯॥

శ్లో॥ మోక్షస్య నహి వాసోఽస్తి । న గ్రామాంతరమేవ చ ।
అజ్ఞానహృదయగ్రంధి । నాశో మోక్ష ఇతి స్మృతః॥౧౫౦॥

శ్లో॥ అహిమివ జనయోగం సర్వదా వర్జయేద్యః ।
కుణపమివ సునారీం త్యక్తకామో విరాగీ ।
విషమివ విషయాన్యో మన్యమానో దురంతాన్ ।
జయతి పరమహంసో ముక్తబంధః స మేతి॥౧౫౧॥

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమచ్ఛంకరాచార్య
* విరచితాపరోక్షానుభూతిః సమాప్తః॥ *



# *శుకచరిత్ర.*

కం॥ శ్రీమచ్ఛుభగుణగణమా*యామానుషదేహధరణ*యాగోద్ధరణా*
హేమాంభరణసుజనప్రభు*చ్ఛీమార్ణవ శీతకిరణ*సీతారామా॥

గీ॥ అవధరింపుముపాండుపుత్రాగ్రజునకు । నాపగాపుత్త్రుడిట్లనియానతిచ్చె ।
తండ్రిజెప్పినసద్బుద్ధి దలచిశుకుడు । బుద్ధిలోనిట్టులనిదలపోయదొణగె॥

## *నిత్యానిత్యవస్తువివేకము.*

కం॥ నిత్యంబగుపరమార్థము*నిత్యంబనితలచి తెలియ*నేరనిమర్త్యుల్*
నిత్యముగానిప్రపంచము*నిత్యంబనికాంచిమమత*నిలుపుదురెపుడున్॥

వ॥ ఇట్లగుటంజేసి.

చ॥ నిత్యమెదేహగేహములు నిత్యమెపత్నిసుతాదులర్థముల్ ।
నిత్యమెవస్తువాహనములు నిత్యమెపల్లెలు పట్టణంబులున్ ।
నిత్యమెదేశకాలములు నిత్యమెరాజ్యవిభుత్వలోకముల్ ।
నిత్యమెభూతముల్ప్రకృతి నిత్యమెనెమ్మది నెంచిచూచినన్॥

వ॥ అదియట్లుంజేసి.

సీ॥ తనువునిత్యంబనితలపోయనదియును । గర్భంబునందొక్కకరణినుండు ।
నుదయమొందినయప్పుడొకచందముననుండు । బాల్యంబునందొక్కపగిదినలరు
కౌమారముననొక్క కైవడిభాసిల్లు । జవ్వనంబుననొక్కసరణినుండు ।
వార్ధకంబుననొక్కవడపునవిలసిల్లు । మరణంబునందొక్కమాడ్కిదనరు ।

గీ॥ నట్టిదనరుచున్న నదినిత్యమనదహా । నాదివిధులచేత నస్యమగును ।
గానబుద్బుదంబు గతినస్థిరంబని । త్యంబునిశ్చయంబు దలచిచూడ ।

కం॥ మందిరములునిత్యంబని*డెందంబునదలుపనవియు*డిందుపడంగా*
నందగుకానరెకనుగొం*న్నందుకవనిసాక్షిమరల*నవిగట్టుటయున్॥

ఉ॥ పత్నిసుతాదులెల్ల పుడు బాయకనుండుట నిత్యమంటివా ।
పత్నిసుతాదులుం బుడమిప్రాణవియోగమునొందిరేనిత ।
త్పత్నిసుతాదిదేహములు పావకకీలలఁగాల్చి నిస్పృహన్ ।
యత్నమునొడలీరసుల యందుతపంబొనరించ జూడమే॥

గీ॥ ధనమునిత్యమనిన ధనముసంపాదించి । దాచువాఁడొకండు తదనుభవము ।
గాంచువాఁడొకండు గానియెవ్వనిధన । మెవ్వఁడనుభవించు నెంచిచూడ ॥

గీ॥ వస్తువాహనములు వచ్చునే కోరిన । వచ్చువేళతానె వచ్చునదవి ।
పోవువేళతాన పోవునింతియెకాని । యదియునిత్యమనుటలరయకల్ల ॥

ఉ॥ పల్లెలుపట్టణంబులొక పట్టునసంపదలుల్లసిల్లునా ।
పల్లెలుపట్టణంబులొక పట్టునపాడగునొక్కపట్టునన్ ।
పల్లెలుపట్టణంబులగు పట్టణముల్ తగుపల్లెలౌటచే ।
పల్లెలుపట్టణంబులకు బాల్పడనిత్యతగల్గునేగతిన్ ॥

చ॥ ఒకతరిసత్యసంకలిత మొక్కతరిం ధనధాన్యసంవృతం ।
బొకతరిగ్రామమధ్యయుత మొక్కతరిన్ వనపర్వతోగ్రదం ।
బొకతరితాపసోపహిత మొక్కతరింమృగపక్షిపూరితం ।
బొకతరిసర్వశూన్యమగుచుండుట దేశమునిత్యమెట్లగున్ ॥

గీ॥ అవనిదినవారపక్షమాసాఖ్యయుగములరుగదినవార పక్షమాసాఖ్యయుగము
లరుగుదెంచును నశ్లైననవియుయోగ । నిష్టులకులేమికాలంబనిత్యమరయ॥

మ॥ బలహీనంబగువానిరాజ్యములు సంప్రాప్తానుసారంబునన్ ।
బలవంతుండుగ్రహించి తత్కలితసౌభాగ్యంబులొందున్ భువిన్ ।
బలవాంచాపృథివీయటన్న వచనప్రాగల్భ్యమున్ సిద్ధమై ।
నిలువన్నింతియెకాని రాజ్యములకున్ నిత్యత్వమున్ గల్గునే॥

కం॥ రాజ్యములకునిత్యత్వము*త్యాజ్యంబని చెప్పమరియు*ధారుణిలోనన్*
రాజ్యవిభుత్వంబులకును*త్యాజ్యమునిత్యత్వమనుచు*తలపంబనియె॥

కం॥ లోకములునిత్యమనుచువి*లోకింపగ మొదలుభవము*గలుగుటతుదినా*
లోకంబులులోకస్థులు*లోకేశులతోడజెడివి*లోపమునొందున్॥

కం॥ భూతములుప్రకృతియందు*ద్భూతములగు నెట్టులట్లు*బోలయునను చుప్రా*
ఖ్యాతిగశ్రుతులెరిగించుట*భూతములకుగలదెనిత్య*భూతత్వంబున్॥

గీ॥ ప్రకృతినిత్యమనిన పరికింపనదియువం । ధ్యాకుమారుభంగినభ్రివంక ।
జంబుకరణిశశవిషాణంబు భాతిన । భావమగునుతత్వపరులయందు॥

గీ॥ యిన్ని జెప్పనేలనెంచిచూచినభూత । భావికప్రపంచపటలమెల్ల ।
నస్థిరంబనిత్యమనిశ్రుతుల్ బలుకుపె । ద్దలువచింతురాత్మదలపనిజము॥

వ॥ అట్లుగావున.

కం॥ పరమార్థమునిత్యంబ*ప్పరమార్థము దెలియువారి*బాయకనేనా*
పరమార్థము దెలిశెదత*త్పరమానసయుతుడనగుచు*బహుయత్నమునన్॥

వ॥ అనియివ్విధంబున నిత్యానిత్యవస్తువివేక ప్రశస్తుండై వెండియుశిష్యుండు యిహా
ముత్రార్థ ఫలభోగవిరాగోత్సాహంబున నిట్లనియె.

కం॥ ప్రకటంబులగుచుభువినై*హికభోగము లనగధాత్రి*భూషణములునై*
వికలోక సుఖములాము*ష్మికభోగంబులుగదా*ప్రసిద్ధివహించున్॥

* యిహాముత్రార్థ ఫలభోగవిరాగము. *

కం॥ అందైహికంబులనఘన*తందలప ధనేషణంబు*దారేషణమిం*
పొందెడుపుత్రేషణమని*యందురవనిగాంతశ్రేయ*నవిసౌఖ్యములే॥

గీ॥ సారదిధనముగలుగ సుదతియుగలుగును । సుదతిగలిగెనేనిసుతుడుగలుగు ।
సుతుడుగలిగెనేని సుగతిగల్గునటంచు । తొలుతధనమునొందదలపుచుండ్రు।

*ధనిషణ*

కం॥ ధనమార్జించుటలార్జిం*చినధనమును దాచుకొనుట*చింతలుడిగిదా*
చినధనము వ్రయము శేయుట*గను గొనసత్యంతదుఃఖ*కరమెట్లన్నన్ ॥

ఉ॥ మాయలమంత్రతంత్రముల మంత్రిపురోహిత భృత్యసేవకా।
న్యాయములంప్రభుత్వముల నాటకవిద్యల వేషభాషలన్।
కాయకవృత్తులందురిత కర్మములన్ వ్యవహారకర్తకో।
పాయములన్ పదార్థముల పారముపార్జనశేయుమర్త్యుడున్॥

తరల॥ మధురసంబులనేక పైనసుమంబులం గలతేనియల్।
యధికతంగొని తేనెబెట్టినయట్లు పెక్కువిధంబులం।
యధమకృత్యములాచరించి దురాశనెమ్మది ద్రిప్పగా।
యధనుడొక్కొక కాసుగూర్చి మహాపదార్థముగైకొనున్॥

కం॥ యీరీతిధనముగైకొని*యేరికిగనరాకయుండ*నేలుటకొరకై*
పారంబులేనిచింతా*పారంగతుడగుచుదుఃఖ*పడుభయపడుచున్॥

మ॥ తనకర్థంబుగలంగు నంచువినియేతంముల్ సమర్థింతురో।
వనితల్ బోసుదురో సుతుల్ జెరుతురో వైరుల్ పగల్ శేతురో।
ఘనులర్థింతురో రాజమంత్రివరులుం గాంక్షింతురోచోరులుం।
గొనిపోనేగుదురో యటంచుమదిలో గుందించుతేదక్షుడై॥

గీ॥ యిటుగుందికుంది యేకాంతమున నెవ్వ। డెరుగకుండతనకు మరుపురాక।
గురుతుపడగనొక్క గురిజేశిభువినొక్క। చోటదాచియదియె చూచుచుండు॥

వ॥ కావున.

సీ॥ చెలిమిం బిసాంమ్ములు శేయించుమనియన్న।కొడుకులుద్యోగంబుకొరకునడుగ।
చుట్టాలువిందుల సాక్కుసూచనసేయ। స్నేహితులాపదల్ జెల్లికొర।

అర్థులుసమయంబు లరశిచేతులుజాప। ప్రభువులునిర్బంధపరచివేడ।
మంత్రులుగుప్తసంమ్మతి జేశియాచింప। చోరులులోలోనచోరువశేయ।
గీ॥ తనువువిడుచుగాని ధనమునందొక్కింత। చనువువిడువడింక చచ్చిమీద।
వడిపిశాచమగుచు వశియించుగాబోలు। మొసగరాదదని కొంతబలమొ॥

మ॥ తనవారల్ మరితానొరుల్ గుడుచుటల్ దప్పించియీకూడబె।
ట్టినవిత్తంబొకయించుకంత ప్రయపెట్టేవేళ్లలున్ వచ్చెనా।
తనలోతానెకృశించునింక మమతన్ తద్విక్రయానంతరం।
బునవాడుంవిని బ్రతుకునో బ్రతుకడో బుద్ధిన్ విచారించినన్॥

గీ॥ తలపనిల్లుతాను తనవారుగుడువక। ధరణినొక్కచోటదాచుధనము।
దైవగతియుదప్పి తస్కరుల్ గొనమీద। దుఃఖజాలములకుతుదయుగలదే॥

వ॥ కాపున.

చ॥ తమకుధనంబొసంగుమనిదల్చి ధనేచ్ఛలజిక్కి తగ్గురూ।
త్తములగుచున్ స్వధర్మములుదప్పి సుయోధనుజేరి పాండుభూ।
రమణకుమారదారుణ శరాసనముక్తశరాగ్నినుగ్రయు।
ద్ధమునఘటోద్భవాద్యఖిలధాత్రీసురల్ మృతిబొందచూడమే॥

కం॥ కావునవిత్తంబిడుములు*గావింపుటకధికమైన*కారణమనినే*
భావించివిత్తవాంఛలు*బోవిడిచెదనాదుపాప*పుంజమడొలగన్॥

* దారేషణ *

కం॥ దారేషణమైననుసుఖ*సారంబనియన్ననందు*సంప్రాపితదుః।
సారమహాదుఃఖములకు*పారంబును లేదుమదిని*పరికింపంగన్॥

ఉ॥ మూత్రబిలంబునందు నొకమూత్రబిలంబునజొచ్చివెండియు।
మూత్రబిలంబువెల్వడి సమూత్రములం క్రిమిరక్తమాంసమా।

గాత్రముగల్గియట్టి సతిగ్రక్కొని మద్ర్భమనొందియాసతీ।
మూత్రబిలంబెయాసపడి మోసమునొందెదరజ్ఞలేమనన్॥

కం॥ ఆరమణిసుఖమునకునా*గారంబొడిగట్టుకొని*సకాముకులైదు*
స్సారములగు వివిధవశా*పారములజరించి పెక్కు*బాధలబడుచున్॥

కం॥ అధరకుచయుగళమధురా*ధరరసముపయోధరంబు*లలరతికాంతా*
ధరగృహాసంగతులనబా*ధరతులనిలుపుమనుసు*పామరుడగుచున్॥

సీ॥ అధరోష్ఠమునసౌఖ్య మలవడుననందు। మొనసినాలోచ్ఛిష్టములుజనించు।
కుచయుగంబునసుఖప్రచురమౌననవి। యలఘుమాంసగ్రంధులగుచునిక్కు।
కమలాస్త్రగేహాసంగతిసౌఖ్యమననందు। మూత్రరక్తంబులింముగస్రవించు।
అంన్యోన్యరతులయందగుసుఖంబ్బననది। యత్యల్పమాత్రమైయరుగునట్లు।
గీ॥ గాననెన్నింటజూచిన కామినీశ। రీరములయందు హేయవికారములును।
గలిగియుండంగదానిపై కాంక్షజేసి। యనసియుండెడువారలకేమిసుఖము॥

మ॥ తలలోపేనులు కండ్లలోపుసులు దంతశ్రేణిలోతావి।
వీనులలోజిబిలి నాసలోబడిశముల్ నోట్లోకఫంబూరులన్
మలమూత్రంబులు మేనిలో రుధిరదుర్మాంసకి (క్రిమి?)స్నాయువుల్।
మలయున్ హేయముగా సతింగనరు కామాంధుల్ గదామర్త్యులున్॥

గీ॥ అట్లుహేయరూపమనివిచారింపక। వెర్రిబట్టినట్టువెలదియందు।
మమతగలిగిమదనిమదనభూతముసోకి। చెప్పినట్లుహితవుసేయుచుండు॥

వ॥ కావున.

సీ॥ కలికియప్పుడుతన కనులగన్నడకున్న। కనుపట్టిముచ్చటల్ గరుపకున్న।
వలచినవస్తువుల్ వాకృచ్చితెమ్మన్న। తేకున్ననలుకలుదెలుపుచున్న।
జారబుద్ధులజిక్కి స్వవశంబుగాకున్న। స్వవశమైకూటమిజరుపకున్న।

తగునలంకారంబు దప్పించుకున్నను । నొప్పిదప్పులచాతనొచ్చియున్న ।
గీ॥ మఱికొన్ని విషమమార్గముల్ గైకొన్న । తలపులోనవగపుదగిలియుండు ।
తుదివియోగమైనతుద లేనిదుఃఖంబు । ప్రాప్తమొందుసుఖముబడయడెందు॥

వ॥ అట్లగుటం జేసి.

మ॥ అగసంహారుడనంగసంగతినహల్యం జెందితద్భర్తృశా ।
పగతుండై వగబొందెచంద్రుడుబృహస్పత్యాంగనాసక్తుడై ।
వగబొందె దగరావణుండవని జాతం దెచ్చి శ్రీరాముచే ।
దెగటార్పంబడెగాన దుఃఖమయమీ స్త్రీసంగమాసక్తియున్॥

కం॥ కావునదారాపేక్షలు*బోవిడచిననాడెపరమ*పుణ్యుడటంచున్*
భావించెదతద్వాంఛా*భావుడనై యుండెదనుస్వ*భావముతోడన్॥

*పుత్రేషణ*

కం॥ మరిపుత్రేషణమైనను*పరమసుఖంబనితలంప*బలువై యుండున్*
పరిమితములేనిదుఃఖము*పరివృతమగుతనయుబద్ధ*పామరమతికిన్॥

కం॥ సుతుడొదవమిదుఃఖముధర*సుతుడుసుడియుదుఃఖమగ్గు*సుడియకయున్నన్*
సుతుడొదవునపుడుసతికో*సుతునకుహానియనివగచు*చున్వాలపించున్॥

ఉ॥ హానియొకింతగల్గక ప్రియాత్మజుడుద్భవమొందెనేనివా ।
తానలశీతవాత పవనాహిమృగజ్వరరుగ్భయాప్తినే ।
హానిగలుంగునోయని యహర్నిశమారడిగుందుచుండునే ।
హానియులేక పెంపుగాను నప్పటిచింతలనంత మెట్లనన్॥

సీ॥ తనయుడాకలిగొన్న తగపెంపుగానకున్న । తనకండ్లబడకున్నతప్పుకొన్న ।
నడుపులు రాకున్న నుడువులు లేకున్న । విడిబడిచనుచున్న కుడువకున్న ।
వాజగలుగకయున్ననొకమాటవినకున్న । చదువులుశాస్త్రముల్ చదువకున్న ।
వడుగుగాకున్న వివాహమొందకయున్న । జారచోరక్రియల్ సలుపుచున్న ।

౪౪ శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్త్వ కందార్థానేక సదృష్టాంతప్రకాశిక.

గీ॥ సబలుడైయున్న ననపత్యుడైననృప। యోజకుండైనదారిద్రయుక్తుడైన।
తల్లిదండ్రులదుఃఖంబుదలపవశమె। గానపుత్రేషణంబుదుఃఖంబెతలప॥

వ॥ అట్లుగావున.

తరల॥ తనమనఃప్రియభామినీవశతంగుమారునిదండకా।
వనికిబోవగనంపినంతట వానిబాశితినంచుదా।
తనయవాసనచేతరాముని తండ్రిప్రాణముబాయడే।
తనయవాసనకంటెదుఃఖము ధాత్రియందుగలుంగునే॥

కం॥ జగతిన్స్మృతులునపుత్రు*స్వగతిర్నాస్తియనిచెప్పె*నందునదుఃఖం*
బగపడజేసినతండ్రికి*సుగతియుగలుగంగజేయు*సుతుడనితలపన్।

మ॥ భువిలోనెవ్వడుశేయుకర్మమతడేభోగించునంచున్శ్రుతుల్।
వివరించున్నది గాకతండ్రులకు మున్నేసుతుల్జన్మజ।
న్మవిశేషంబులనుందురందు నొకజన్మంబొందరాకుండమ।
కర్మవశేతండ్రికినేసుతుండు గతిచేకూర్చెన్ విచారింపగన్॥

గీ॥ గానశాస్త్రతతులు కావేటికాల్వలు చేరియవిపరీతు శేయనేల।
పుడమిలోదలంపపుత్రేషణంబుపో। విడుచువాడెసుఖముబడయునెపుడు॥

వ॥ అనియిట్లు ఐహికంబులత్యంత దైహికంబులగు నేహకంబులని విచారించి మరియు. ఏతత్సాధనంబులైన కృషి వాణిజ్య సేవా యాచనాదిలౌకిక కర్మంబులు సుఖప్రదాయకంబులని వివేకించినా॥

కం॥ కాయక్లేశంబధిక*వ్యాయామముబాయుశీత*వర్షాతపగ*
మ్యాయాసంబనశాయో*పాయంబైయుంటదుఃఖ*పదమేకృషియున్॥

కం॥ పూజ్యంబనృతాద్యఘచయ*భోజ్యమునిజవర్ణమునకపూజ్యముధర్మ*
త్యాజ్యమునైయొప్పెడువా*ణిజ్యముబహుదుఃఖములకు*నెలవైయుండున్॥

చ॥ కులముగుణంబుశీలమును గోత్రముపాత్రముపేరుపెంపుదో ।
ర్బలముప్రతిష్ఠయుం యశముపౌరుషమున్దగు సాంప్రదాయముం ।
దలపకశిగ్గులేక మరితక్కువయెక్కువలెన్నబోకయే ।
కులజునినైనగొల్చిమనగోరెడిసేవకవృత్తిసౌఖ్యమే॥

కం॥ భిడియంబువలపునెమ్మది*ముడిబడవినయంపువాక్య*ములదైన్యముజూ*
పడవేళలరశియింతరుల*నడిగెడుగడుయాచకత్వ*మగుదుఃఖంబున్ ॥

కం॥ కావునకృష్యాదికములు*గావింపుటకెన్నతరము*గానిక్లేశం*
భావిర్భవించునవియవి*గావింపనివాడుసుఖము*గాంచుధరిత్రిన్ ॥

వ॥ అనియిట్లుఐహికంబులును తత్సాధనంబులైన కృషివాణిజ్యాది లౌకికంబులున మహాదుఃఖస్వభావికంబులని విలోకించి మరియును.

కం॥ ఆముష్మికములనైనన్*గావించిభుజింపసౌఖ్య*కరములటన్నన్*
ఆముష్మికంబులాసుర*కామినిభోగంబులండ్రు*గాదెధరిత్రిన్॥

కం॥ ఆలోకసత్యధరపా*నాలింగనరతిసుఖముల*నారశిచూడన్*
యీలోకసత్యధరపా*నాలింగనరతిసుఖముల*యట్లువెలుంగున్॥

కం॥ కాయంబులనొదవుసుఖని*కాయంబులుస్వర్గసుఖని *కార్యములగుటన్*
హేయంబులస్థిరాభి*ప్రాయంబులుసంతతా* శుభప్రాయంబుల్॥

కం॥ ఆలోకస్థులుమరియున్ *ఈలోకస్థులవలెనె*మదీర్ష్యాదోషే*
చ్ఛాలోభమత్సరాదుల*ప్రేలుచువర్తింతురెపుడు*ప్రేమలులేకన్॥

చ॥ వొకనిపదంబొకండుగొను నొక్కనిభార్య నొకండుగైకొనున్ ।
నొకనికొకండుదిట్టుకొను నొక్కనికొక్కడువేధశేయుసం ।
దొకడుకృశించు సంతశిలు నొక్కడునంచునుజెప్పుచుండదై ।
వికములు సౌఖ్యమంచనుభవించగ గోరెడివారినేమనన్॥

గీ॥ అట్లుదుఃఖరూపమైన వేదజ్ఞులె ట్లధ్వరంబులవనినాచరించి।
తత్సుఖంబులొందదలపుదురనడి। మోహవశతగాక ముఖ్యమగునే॥

చ॥ సవనముసల్పదుఃఖమగుసల్పినసాంతముగా యథావిధం।
బవుటయెదుఃఖమైన మతమందినమీదట తత్సుఖాప్తిదా।
నవునని వేదముల్ దెలుపునట్లయినన్ దుదియాసకోలె।
కవుటగలింగనేనియది యస్థిరమైచను దెంచుచూడగన్॥

ఉ॥ కావునసవ్యసాచికిని కంసవిరోధి సకామ్యులైరయా।
భావవిధుల్ క్రతుక్రియల బాల్పడిపుణ్యములందివానిచే।
దైవికభోగసంపదలు తాలిమితో భుజియించితత్ఫలా।
భావములొందగా మనుజభావమునొందుదురంచు జెప్పడే॥

గీ॥ అట్లుగానపుడమినాముష్మికములత। త్సాధనంబులైనసవనకర్మ।
తతులవిడచువాడె ధన్యుడట్లౌటత। త్కాంక్షవదలివరముగాంతునేను॥

వ॥ అనియిట్లు ఐహికాముష్మిక భోగంబులయందనురాగంబును వియోగంబునొం
దించి వెండియు శమ దమోపరతి తితిక్షా శ్రద్ధా సమాధానంబులు గలుగు
వాడు సుఖియనితలంచి.

*శమము.*

కం॥ వెలుపలవిషయంబులలో*పలరాగాదులజరించు*పటుమానసబు*
ద్ధులుమలిపి శ్రవణమననా*దులనిలుపదలంచుశమము*దొరకొనియుండున్॥

*దమము.*

కం॥ విశ్రాంతిగవిషయంబుల*కశ్రమతజరించునింద్రి*యములమలిపినే*
నశ్రాంతంబామ్నాయాం*తశ్రవణాదులువహించు*దమమొనరింతున్॥

*ఉపరతి.*

ఉ॥ కర్మమెనర్పజన్మములు గల్గునుసల్పమిదో షమాటచే।
కర్మమెనర్చ్ఛిదించుట యు కాయుపరత్యను భూతియుండ్రులో।
మర్మమెరింగి బుద్ధినభిమానము లేక నకర్మదృష్టిస।
త్కర్మమెనర్ప నోపరతిగాయని చెప్ప దురాత్మవేత్తలున్॥

వ॥ అదియునుంగాక.

కం॥ వింతలగువిషయపంక్తుల*కెంతో వడినేగుబహువిధేంద్రియములక*
త్యంతశ్రవణాదికమునీ*రంతరమలపరచుటయుప*రతియండ్రుబుధుల్॥

కం॥ కానుననిందేయుపరతి*గావించిననోకసరియె*కాపుననిపుడే*
భావంబులోననుపరతి*సేవింపుచు నిత్యసుఖము *జెందెదనియుతిన్॥

*తితిక్ష*

కం॥ నిందించిన సంతతమభి*నదించిన మేలుకీళ్లోనర్చినదుఃఖం*బొందసుఖ
మొందనప్రియ*మొందప్రియంబొందసమత*నోర్పువహింతున్॥

*శ్రద్ధ.*

గీ॥ గురునియందుగురుడు గురుత్తుగా జెప్పిన। మంత్రమందుతదభిమానియైన।
దైవమందుదైవతత్త్వంబుదెలిపెడు। శాస్త్రమందుబుద్ధిజరుపుచుందు॥

ఉ॥ యేనెరినైనప్రిపిపినహృదింద్రియబుద్ధులహార్ని శంబుపూ।
ర్వానుభవాభిలాష విషయంబులకై చనువానిమల్పినా।
నానిగమాంతశాస్త్ర వచనశ్రవణాములనిల్పుతత్సమా।
ధానమెమన్నసఃపర నిధానముగాగాని యభ్యసింపుదుర్॥

*ముముక్షుత్వము*

కం॥ సాక్షాజ్జగదీశప్ర*త్యక్షకరంబమితసుఖని*ధానముసంసా*
రక్షోభహరముజన్మవి*మోక్షప్రదమైనమోక్ష*మునపేక్షింతున్॥

వ|| అనియిత్తెరంగున నిత్యానిత్య పదార్థవిభాగియు నిహాముత్రార్థ ఫలభోగవిరాగియు శమాదిషట్క సంపత్ప్రభోగియు ముముక్షుతా సంయోగియునగు శుకయోగియు తండ్రిపాలికిం జనుదెంచి సవినయంబుగా నిట్లనియె.

కం|| లోకంబున మోక్షమునక * నేక పథంబులుగలుంగు * నెయ్యది గలదం *
దేక పథంబొక్కటియది * చేకొని సులభముగ నాకు * చెప్పవె తండ్రీ||

వ|| అనిన వేదవ్యాసుడిట్లనియె.

గీ|| ఓకుమార పుడమినొకడు మున్నిట్లెవ్వ । డడుగరాని గోప్య మడిగినాడ ।
వైననీవుదీనికధికారి వట్లౌట । నేర్పరింతు వినుత దేకబుద్ధి||

కం|| అక్షయగురుకారుణ్యక * టాక్షోదయతత్వమసి * మహావాక్యప్ర *
త్యక్షైకాత్మజ్ఞానమె * మోక్షమునకుముఖ్యమార్గ * ము విలోకింపన్||

గీ|| అనినశుకులు ముక్తికాగమాంతజ్ఞాన । మవనిముఖ్యమార్గమై వెలుంగ ।
సద్గురూపదేశ సంప్రాపితజ్ఞాన । మగును ముఖ్యమార్గ మనగ నేనూ||

కం|| అన వేదవ్యాసుడి * ట్లను ధారుణిలో ననాగ * మాంతజ్ఞానం *
బును సద్గురుకారుణ్యం * బున నే ప్రాప్తమయి వృద్ధి * బొందుచునుండున్||

వ|| కావున

సీ|| రాజముఖ్యుడు లేని రాజ్యంబుచాడ్పున । ప్రభువరేణ్యుడు లేని పల్లెమాడ్కి ।
అభిమాని లేని గృహంబు చందంబున । పురుషుండు లేని పూబోణికరణి ।
తల్లితండ్రులు లేని తనయుని పోలికె । శిక్షాక్రమము లేని శిశువు రీతి ।
బలువు కావలి లేని పైరుపంటల భాతి । పరిపాలకుడు లేని పశువు పగిది ।

గీ|| అంబుగతియు లేని యంకురంబుల భంగి । దేహి లేని రిత్త దేహమట్లు ।
గురుడు లేని విద్య కూడ దెవ్వరికైన । విధికినైన వేద విభునకైన||

చ|| గురుడుగలంగి విద్య సమకూడక యుండుటగాదె నేటికా ।
సరసిజగర్భ శక్ర సురచారణ కిన్నరసిద్ధసాధ్యకిం ।
పురుష ఖగోరగామరరిపు ప్రముఖుల్ సశరీరులై దివిన్ ।
మురయుచు నల్పసౌఖ్యముల ముక్తులుగాక వశింపచూడమే||

కం॥ కావునగురుకరుణావి*భావాత్మజ్ఞానమే*శుభంబగునిర్వా*
ణావాప్తి కేకమార్గము*నావుడుశుకుడిట్టులనియె * నయముదలిర్పన్॥

కం॥ గురువులననెట్టివారలు*గురువులశిష్యులవిధ మ్మెట్లు*గోలిచెదరెట్లున్*
గురువులుపదేశమిత్తురు*గురిపడనన్నియునెరుంగ*గోరెద చెప్పుమా॥

వ॥ అనిన సత్యవతీసూనుండిట్లనియె.

*గురులక్షణము.*

సీ॥ ధరలోనశిష్యవిత్తాపహారులు వేద। శాస్త్ర వేదులుకులాచారరతులు।
కామరాగాదిసంకల్పసిద్ధు లమర। హంకారదంభదర్పాదియుతులు।
బహువేషభాషా ప్రభావసంపన్నులా। చార్యులనేకులుసంశ్రయింప।
దలతురింతియెకాని దలపోయశిష్యహృ। త్తాపహారులుబ్రహ్మతత్వవిదులు।

గీ॥ గతకులాచారు లపహతకామరాగ। ముఖులహంకారదంభప్రముఖవిదూర।
భావనులవేష భాషాప్రభావులగుచు। దొరయుచుండెడుగురుడతిదుర్లభుండు॥

వ॥ అట్లగుటంజేసి గురుశబ్దార్థంబు వినుము.

గీ॥ పటుగుకారమనెడుప్రథమవర్ణము ప్రకృతి। నాదిగుణసమాశ్రయముకార
మనుద్వితీయవర్ణ ముగుబ్రహ్మమన్నగుట। గురుడనంగ త్రివిధగుణహరుండు॥

గీ॥ ఆద్యమగుగుకార మంధకారము తేజ। మంత్యమగురుకార మట్లుగాన।
గురుడనంగశిష్య గురుతరాజ్ఞానాంధ। కారనాశకప్రకాశుడనఘ॥

వ॥ అట్లగుటంజేసి గురుస్వరూపంబెఱింగించెద నాకర్ణింపుము.

సీ॥ మూలప్రకృతియాలవాలంబుసుఖదుఃఖ। ములుబీజములుగుణంబులును వేళ్లు।
పురుషార్థములు రసంబులు నింద్రియములూడ। లూర్మలు స్వభావంబు
లొనరధాతు।

పులుపొరల్ ప్రకృతులు పృథులైనశాఖలు । మేటిరంధ్రమ్ములుకోటరములు ।
ప్రాణంబులాకులు బలువిషయంబులె । గుబ్బరాగాదులు కురుచకొమ్మ ।

గీ॥ తెలిమిక్రియలెల్ల విరులుజీవేశులందు । పక్షులనుగల్గు సంసారవృక్షమెక్కి ।
నరకకూపంబులోబడు నరునినెవ్వ । డుద్ధరించునువాడె గురూత్తముండు॥

సీ॥ ఘనతమంబనియెడు కమఠంబువిహరింప । తతరజంబనెడు మత్స్యంబుమెలగ ।
మహితరోషంబను మకరంబుజరియింప । వరకామమనెడి శైవలముగప్ప ।
మదమత్సరములను మండూకములు జేర । పొదలురోగములను బుగ్గలాదవ ।
పెనులోభమనియెడు ఫేనంబుదేలాడ । విసరిమోహంబను వేలమలర ।

గీ॥ జన్మమృత్యువులను భంగచలనమొప్ప । దుఃఖమనుజలనాహిని దొలగకుండ ।
భవజలధిలోనమునిగెడి పాపినెవ్వ । డరశిదరిజేర్చువాడె సద్గురువరుండు॥

సీ॥ గురుమంత్రనిష్ఠానుకూలుడానైశిష్యు । గురుమంత్రనిష్ఠానుకూలుజేయు ।
వివిధవేదాంతార్థ విదుడుతానైశిష్యు । వివిధవేదాంతార్థ విదునిజేయు ।
సగుణసాక్షాత్కార శాలితానైశిష్యు । సగుణసాక్షాత్కార శాలిజేయు ।
బ్రహ్మానుసంధాన పరుడుతానైశిష్యు । బ్రహ్మానుసంధాన పరునిజేయు ।

గీ॥ అనుపమామృత పదవిదానందిశిష్యు । ననుపమామృత పదవికినంపునెవ్వ ।
డతడెభక్తహితార్థమై యవతరించి । నట్టిసద్గురువరుడని యరయవలయు ॥

గీ॥ శాంతమవ్యక్తమజడంబు శాశ్వతంబ । తర్క్యమునిరంజనంబు చైతన్యమజము ।
నాదబిందుకళాతీతనాదిమూల । మగుపరబ్రహ్మమయుడెవ్వడతడెగురుడు ॥

శా॥ నానాబుద్ధ్యతిరిక్తుడభ్రనిభుడానందప్రదుండేకదే ।
శాన్నిష్టుండగుణుండు కేవలుడు భావాతీతుడద్వైతిబ్రం ।
స్వాత్మానందుండమలుండు తత్త్వమసిముఖ్యార్థుండునిత్యుండువి ।
జ్ఞానాంగుండచలాత్ముడెవ్వడతడాచార్యుండు సేవింపగన్ ॥

కం॥ యేపదమఖండమండల*రూపకముచరాచరస్వ*రూపత్రిజగ*
ద్వ్యాపకమగుభువినెవ్వం*డా పదమెరిగించునాత*డాచార్యుడగున్ ॥

కం॥ సరసీరుహసంభవుడా*పురుషోత్తముడంబికావిభుం*డఖిలజగ*
త్పరిపూర్ణబ్రహ్మంబే*పురుషుండైయుండువాడెపో*గురుడరయన్ ॥

కం॥ యెవ్వనియనుగ్రహంబున*నివ్వటిలుమవిష్ణుమయుడ*నేనిక నాయం*
దివ్విశ్వముకల్పితమని*నవ్వచువశియించుగురుడ*నంబడునతనిన్ ॥

కం॥ అజ్ఞానాంధునికన్నులు*విజ్ఞానాంజనశలాక*విప్పించునుయో*
సుజ్ఞానియతడుగురుడని*ప్రాజ్ఞులుసంతతముభక్తి*ప్రణుతింతురిలన్ ॥

కం॥ శివహరిరుద్రేశసదా*శివులెవ్వనికుక్షిలోన*చెలువొందుచుదా*
నివసించియుందురుసూ*ప్రవిమలుడాచార్యుడనుచు*భావింపదగున్ ॥

కం॥ ఆకాశతుల్యమైహృద*యాకాశజ్యోతిమైని*రాకాశంబై*
యాకాశసాక్షియైనచి*దాకాశంబెవ్వడతడె*యాచార్యుడగున్ ॥

గీ॥ దృశ్యమెదుటలేక దృష్టియునాలంబ। నంబులేకమానసంబుకింత।
యలసటయునులేక ననిలంబునిలుచునే। సత్తమునకతండు సద్గురుండు॥

వ॥ వెండియు, వివిధ వేద వేదాంత శాస్త్రజ్ఞుండును, శిష్యానుగ్రహప్రకారాభిజ్ఞుండును, శిష్టాచార సంపన్నుండును, పరమేశ్వరానుగ్రహసంపన్నుండును, కామరాగాద్యనేక చిత్తవికారవిరహితుండును, నిష్ప్రపంచ సాహిత్యుండును, శమదమాది గుణగణసహితుండును, అహంకార మమకార రహితుండును, దూరవిచారశీలుండును, నిరంతరవిరక్తుండును, యదృష్టాలాభ సంతుష్టుండును, సకలభూతదయావిశిష్టుండును, వేదోక్తకర్మానుష్టానగరిష్టుండును; ఈశ్వరోపాసనానిష్టుండును, యోగారూఢుండును, సుముఖస్వాంతుండును, పరమశాంతుం

డును, సజ్జనవల్లభుండును, భక్తసులభుండునునైన యతండాచార్యుండగు,నట్టి యాచార్యత్వంబు బ్రాహ్మణుండు త్తముండగుట నటనియందే సిద్ధించియుండు, వినుము.

శా॥ భూతగ్రామములో నముఖ్యులు వరో ద్భూతులె నరుల్ వారిలో।
చాతుర్వర్ణులు ముఖ్యులందుద్విజులే షట్ఛ్రేష్ఠు రావారిలో।
శ్రోతుల్ శేఖరులందు బ్రాహ్మణులు సర్వాగ్రేసరుల్ బ్రహ్మజా।
నాతి బ్రాహ్మణుడంచు బల్కెడిశృతిన్యాయంబు సిద్ధించగన్॥

గీ॥ హరిముఖోద్భవులగుట శాస్త్రాగమ। ప్రమోదమతులగుట నృపముఖముఖ్యులగుట। నాత్మవిదులౌట బ్రాహ్మణులఖలవర్ణ। ములకు నాచార్యులని శాస్త్రములువచించు॥

వ॥ అట్లగుటం జేసి వర్ణంబులలో నుత్తముండైన బ్రాహ్మణుండు బ్రాహ్మ క్షత్రియ వైశ్య శూద్రముఖ్యులకు। మధ్యముండైన క్షత్రియుండు క్షత్రియ వైశ్య శూద్రులకు అధముండైన వైశ్యుండు వైశ్యశూద్రులకు ఆచార్యుండు గావలయు।అధమాధముండైన శూద్రుండుయవ్వరికాచార్యుండుగారాదటైనను బాతిద్యంబువచ్చు। మఱియునాశ్రమంబులలో సన్యాసులు, సన్యాస వాన ప్రస్థ గృహస్థ బ్రహ్మచారులకును, వానప్రస్థులు వానప్రస్థ గృహస్థబ్రహ్మ చారులకును। గృహస్థులుగృహస్థ బ్రహ్మచారులకును।నియతస్థులైన బ్రహ్మ చారులితర బ్రహ్మచారులకు నాచార్యులు గావలయు।నింతియెకానియధిక వర్ణాశ్రమస్థుల కల్ప వర్ణాశ్రమస్థులాచార్యులుగారాదట్లైనన్ జ్యేష్ఠులు కనిష్ఠులంగూర్చి నమస్కారాదు లొనరింపంగూడదని తెరంగున నమస్కారా ద్యనర్హత్వంబు సిద్ధించు।నింకపరమ హంసాశ్రముండఖల వర్ణాశ్రమంబు లవారికాచార్యుండుగావచ్చు।నయ్యాశ్రముండవధూతాశ్రముండగుట బ్రహ్మ దులకును గోచరుండుగానవు సిద శాస్త్రోక్తప్రకారంబిదియ వొప్పించాను

కూలంబింక పరమార్థంబున వర్ణాశ్రమంబులు పరిత్యజించి యాథేచ్ఛావిహారశీలుండైన విరక్తునకు యోగజ్ఞాన సంపన్నుండైన మహానుభావుండెవ్వండేని యాచార్యుండుగావచ్చుంగావున.

కం॥ గురుతత్త్వంబునకంటెను*పరమొక్కటివేరలేదు*పరికింపంగా*
గురుమూర్తికంటెనధికుం*డరయంభువిలేదటంచు*హరుడువిధించెన్॥

వ॥ అట్లగుటంజేసి లోకంబున నొకానొకపురుషుండు మహాదహనదహిత గృహవిహారాతిఖేదమతులైన దారాపుత్రాదుల సంరక్షించుట కరుగుదెంచి తదియ్యానలదగ్ధశరీరుండై వారినిత్యజించి శీతలజలపాతనంబునకుం బోవు గృహస్థునిచందంబున తాపత్రయానలతం తప్యమాన మానసునకు వైరాగ్యంబుగలిగి సద్గురునింజేరి తనమనంబున.

కం॥ తాపత్రయదావానల*తాపముననాదినుండి*తప్తుండగునా*
తాపము బాపము బాపెడు*ప్రాపెవ్వండతకేను*ప్రణతియొనర్తున్॥

కం॥ సకలచరాచరభూతా*త్మకముచిదానందమయము*త్రైలోక్యవ్యా*
పకముగుపదమొసగెడుబో*ధకుడెవ్వండతనికేను*దండమొనర్తున్॥

గీ॥ శిష్యసంసారహరణవిశేషకార్య। విషయమైదివ్య మంగళవిగ్రహమున।
నవతరించినయచ్యుతానంతుడేస। మత్సద్గురునకు నేనమస్కరింతు॥

గీ॥ మద్గురుండిమ్యశేషజగద్గురుండు। మత్పతియనేకలోకసమాజపతిమ।
మాత్ముడుచరాచరాదిభూతాత్ముడగుచు।మలయునెవ్వండతనికేనమస్కరింతు॥

గీ॥ ఘనచిదానందనానందకరప్రసన్న। జ్ఞానరూపసదాత్మవిజ్ఞానయుక్త।
యోగిరాశ్శిష్యదుర్భవరోగవైద్య। మద్గురుస్వామినెన్నినమస్కరింతు॥

వ॥ అనియిట్లుద్దేశించి.

కం॥ కరపదజానుయుగంబుల*శిరమునవచనములకనుల*చేతోగతులన్*
యురమునప్రణతిమొనర్చుట*నరయగసాష్టాంగవినతి*యనిచెప్పబడున్॥

వ॥ అట్లగుటంజేశి యిన్విధంబున సాష్టాంగదండ ప్రణామంబులొనర్చి సద్గురుసన్నిధానంబున ద్వాదశవత్సరంబులునివసించి శేవింపుచుండవలయు.

### * పరిపూర్ణ సుధాకరము. *

### సీసార్థము.

సంసారమునజాలసంతాపములజెందు*పురుషుడొక్క-డుపూర్వపుణ్యవశత*
సద్గురునాథునిజయ్యనదర్శించి। మొక్కియిట్లనిబల్కె-మోదమలర *
దేశికేంద్రుడజేరదీశియునాకింక*మరణశూన్యంబైనమార్గ మొకటి*
బోధించుడనకోరిభూరిసంస్తుతిజేసి*మనవిట్లుజేయదొడగేను*
యీజన్మమున*ఘనమైనబాధగలైనూ*చనువైనదైనిల్వ*జాలాదుదుఃఖవార్ధి*
మునుగాగజేయుదీన్ని*ముంచీవేయుడియంచు*మనవిట్లు జేయదొడగేనూ॥

### *భద్రాద్రి రామ శతకము.*

### ఈషణత్రయలక్షణం

సీ॥ కామధర్మార్థముల్ గలుగుటకై భార్య। నిశ్చయించుటయుదారేషణంబు।
సుతులు లేకున్ననుగతులు లేవనుచును। పుత్రేచ్ఛనుండుపుత్రేషణంబు।
దానధర్మములచేతరియింతునని। ద్రవ్యమిచ్ఛయించుటయుధనేషణంబు।
దారాదియీషణత్రియములచేతను। యవనిలోసౌఖ్యంబులనుభవించి।
గీ॥ పుణ్యలోకంబులెల్లనుబొందవచ్చు। గానసీలోననైక్యమార్గములుగావు।
రమ్యగుణధామభద్రాద్రిరామపరశు। గోపనరసింహదాససంరక్షితాంఘ్రి॥

### * భావార్థము. *

ధర్మార్థకామములకొరకు భార్యనుగోరుట దారేషణము, సుతులు లేకున్న గతులు లేదని సుతులగోరుట పుత్రేషణము. దానధర్మములచేత తరియింతునని,ధనముగోరుట ధనేషణము యిటువంటి ఈషణత్రయము చేత ఇహలోకసౌఖ్యములను భవించి పుణ్యలోకములు బొందవచ్చును గాని ఆత్మ ఐక్యమార్గములుగావు.

* అష్టపాశములు.

సీ॥ తల్లిదండ్రులుభార్యతనయులుమిత్రులు। ధనముసహోదరుల్ తనువులయిన।
అష్టపాశంబులునమరిబంధములచే। దగిలుండునరుడు యీధరణియందు।
యత్తమామలుబావ యల్లుండ్లుకోడండ్లు। మరుదండ్లువదినెలుమరదులనుచు।
తాపత్రయంబులదగిలి వర్తింపుచు। మత్తులైమనుజులుమందమతిని।
గీ॥ సాధుసజ్జనసంగతి సలుపలేక। మోక్షమార్గంబెరుంగరు మోహరహిత।
రమ్యగుణధామ భద్రాద్రిరామపరశు। రామనరసింహదాసనంరక్షితాంహ్వ

భావార్థము.

తల్లి, తండ్రి, భార్య, తనయులు, ధనము, సహోదరులు, తనువులైనట్టి అష్టపాశములను బంధములచే కట్టుబడినవాడు అత్తలు, మామలు, బావలు। అల్లుండ్లు, కోడండ్లు, మరదండ్లు, వదినెలు, మరదులని తాపత్రయములందు దగులుకొని వర్తింపుచుండును. ఇటువంటి పామరులగు శుద్ధ సంసారులు బుద్ధిహీనతచే పెద్దలసాంగత్యము చేయనేరక మోక్షమార్గమెరుగరు.

* ఐహికవిచారణము *

* శ్రీకృష్ణచిద్విలాససీసములు *

సీ॥ అధరామృతంబనువిధమెరింగిరెకాని। యింతిజొల్లనియుదామెరుగరొక్కొ।
కుచములుబంగారుకుండలంచురెకాని। యదిమాంసపిండమంచెరుగరొక్కొ।
మదనగృహంబనిమదిగణింతురెకాని। యదిమూత్రద్వారమంచెరుగరొక్కొ।
కాయంబుమెరుపనిడాయబోదురెకాని। నిమిషసుఖంబునుచ్చు నెరుగరొక్కొ।
గీ॥ ధరనుస్త్రీలనెలతలదలపనగునె। మోహజాలంబులో జిక్కిమోసమనక।
వరదతిరుమలగిరివాసపరమహంస। చిరతరోల్లాస శ్రీకృష్ణచిద్విలాస॥

సీ॥ కుచములదామిలకులగిరులనియెంచి। యిసుకదిన్నెలటంచు నెరిగిపిరుదు।
లువిదలయూరువులవియరటులబోల్చి। నాసంబుసంపెగవాసినెంచి।
యుచ్చతూటును చాలహెచ్చుగామదినెంచి। నడకహంసయటంచునదిగణించి।

యాహాహాతాబాండితికటులవన్నెయుబెట్ట। నేలయపాండితి నెసగబరువు।
గీ॥ భువిని నిట్టుల గవివరుల్ బోల్చుదగునె। త్రోలుబొమ్మ చెదామెంత మేలుకనిరో।
వరదతిరుమలగిరివాస పరమహంస। చిరతరోల్లాస శ్రీకృష్ణచిద్విలాస॥

యివి తిరుమలగిరి వాస్తవ్యులునగు వైశ్య శ్రీ ముటుపూరి లింగన్న
శ్రేష్ఠిగారిచే రచియింపబడినవి

* భ జ గో విం ద శ్లో క ము *

శ్లో॥ నారీస్తనభరనాభీదేశం। దృష్ట్వామాఘామోహావేశం।
యేతన్మాంసవసాదివికారం। మనసవిచింతయ వారంవారం॥

* భ ర్తృ హ రి *

శ్లో॥ స్తనౌమాంసగ్రంధీ। కనకకలశావిత్యుపమితౌ।
ముఖంశ్లేష్మాగారం। తదపిచశశాంకేనతులితం।
స్రవన్మూత్రక్లిన్నం। కరివరశిరస్పర్ధిరఘనం।
ముహుర్నింద్యంరూపం కవిజనవిశేషైర్గురుకృతం॥

* నా గ త ల్ప శ త క ము. *

సీ॥ స్తనములేరక్తమాంసపుసంచులనుకోక। భ్రమనుంటిహేమకుంభములవలెను।
అధరముంముచ్ఛిష్టమనియుక్కవిరువక। తలచుంటిమధురామృతంబువలెను।
మూత్రపురీషములుండాక్కనుకోక। కనుగొంటినవరత్నఘటమువలెను।
సురతకార్యంబుచే సుటనీచమనుకోక। మరిగుంటిపుణ్యధర్మంబువలెను।
గీ॥ సుందరస్త్రీనితృణముగాజూడలేక। కామమునకెంతొలో నైతికమలనాభ।
చక్రిధరధర్మపురిధామసార్వభౌమ। నరహరీభక్తజనకల్పనాగతల్ప॥

* వే మ న శ త క ము. *

గీ॥ తొడలమెరుపుజూచి దొడ్డకుచములుజూచి। వంకకొప్పుజూచి వనితజూచి।
విటుడుమనుసులోన విరహాగ్నిబొందురా। విశ్వదాభిరామవినరవేమా॥

* కందార్థము. *

(౨౩)*శరణాగతుడగుశిష్యుని*కరుణామృతదృష్టిచాతగనిమోదము*నుప్పిరిగొనమృదువాక్యములను*పరమదయాళుండగుగురుడు*భక్తావినుమనెనూ *సంశయమిక*బాధింపదనెనూ * పరిపూర్ణ మొకటిలే నెరుకా నెదొకటుండు*పరిపూర్ణ మెరుకాల నెరిగియెరుకనుమాను*భక్తావినుమనెనూ*సంశయమిక*బాధింపదనెనూ॥

కం॥ తనకుదావొచ్చినసద్బో* ధను దెల్పుమటంచు మ్రొక్కు*తనశిష్యుకున్
వినజెప్పదొణగెనోకగురు*డనుమానించకను వాని*కతిదయతోడన్ ॥౨౭॥

కం॥ పరమపురుషుడను లేనిది *యెరుకయుగలదరశి లేని*యెరుకనువిడుమం
చెరిగించినశిష్యుడుగురు *వరునడిగెను మ్రొక్కి-రెంట్టి*వర్తనలపుడున్ ॥౨౮॥

* ప రి పూ ర్ణ బో ధా ష్ట మా లి క. *

సీ॥ మరియొకనాడు సద్గురునిగన్గొని మ్రొక్కి । ప్రస్తుతిగావించిపణతిబల్కె ।
భువిలో నరామడుగుశివరామదీక్షితుల్ । వచనకావ్యంబుగనచలబోధ ।
గల్పించెనటదాన్ని కరుణించిదెల్పుము । చనవినిసంతోషమునగురుండు ।
పరిపూర్ణ మొకటిలే నెరుక నేదొకటుండు । పరిపూర్ణము నెరింగి నెరుకనువిడ ।
గీ॥ చాలునిక నేమిబట్టదో సఖయయనిన । యచలమన నేది లే నెరుకనగ నేది ।
యెరుక నెవ్వరుబుట్టించియణగ జేతు । రయ్యవిస్పష్టముగబోధ జెయ్యవయ్యా॥౧॥

కం॥ అని ప్రార్థించినహర్షం*బున పరిపూర్ణమునుజూపి*పురుషయువతులై*
కనుపట్టలేనియెరుకను*కనుగొనుమని చూపిదీన్ని*కలదనకుసుమీ॥౨॥

కం॥ పరిపూర్ణమనినయచలము*యెరుకనవిశ్వంబుతనువు*లెరుకన నేనీ*
వెరుకనసంకల్పంబగు*యెరుక నెయెరుకనుత్యజించ*యెరుకేపోవున్ ॥౩॥

కం॥ లేనికలమేలుకొన్నను*తా నెక్కడనిల్వనట్లు*దబ్బరయగునీ*
వీనిర్మలబోధము మే*ల్కొనుకలవంటియెరుక*గనరాదుజుమీ॥౪॥

౫ శక్తిద్వయనిరాసకంబైన శుద్ధనిర్గుణ తత్వ కందార్థానేక సదృష్టాంతప్రకాశిక

కం॥ పరిపూర్ణముపరిపూర్ణము* నెరుకనుగురు తెరుగ దెరుక* యెరుకనచలము*
యెరుగునుగురు వెప్పటికీ* యెరుకనుగనబోకుపోని* యేమిటికింకన్ ॥౫॥

కం॥ వినుముపరిపూర్ణమందున* తనకై తాబుట్టియెరుకతనపుట్టిల్లున్ *
గనబోవతనకుదానె* కనుపడదీవిశ్వమంత* గనుపడదుజుమీ ॥౬॥

కం॥ మంత్రములు రెండుగలవా* మంత్రంబులలోన మొదటి* మంత్రమచలముౙ్ *
మంత్రించు నెరుక నావలి* మంత్రముమంత్రింపుచుండు* మరునక రెంటిన్ ॥౭॥

సీ॥ తలపోయుచుండుము తరుణిని న్నవరైన । బోధించుమన వారిబుద్ధి నెరిగి ।
తగినవారై రేని తప్పక బోధించు । తగనివారై రేని తగదు చెల్ప ।
నిన్నెన్నొరీతుల నే పరీక్షించియు । బోధనీ కెరిగి స్త్రీ బోధ జేయ ।
తగినదానవటంచు దయ జేశిసుజనుల । తో పొందు సలుపుము దుష్టజనుల।
గీ॥ పొందుకలనైన జేయక పొద్దుగడుపు । చుండుమని చెప్పితానూరకుండెనంత ।
జాలమాంబయు సద్గురుమూలమునను। యెరిగిపరిపూర్ణమున లేని యెరుకనువిడే॥

* ఇతి శ్రీమద్భాగవత కృష్ణదేశికప్రభు విరచిత *
పరిపూర్ణ బోధాష్టమాలిక సంపూర్ణము.

---

శ్రీ శివరామ దీక్షితీయ్యమను బృహద్వాసిష్ఠం

గురువు॥ మొట్టమొదలు పుట్టనిచావనిదానిజాడా కనుకోవలె। కనుకోని । యీదే హాపువర్తమానం అడుగవలె । యీ రెండే కాని । మూడో ముచ్చటఅడుగవద్దు మూలంలేని యీ గుర్తెరిగే శరీరం చంచలం । యీశరీరం దేనియందువున్నదో । అదిఅచలం । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం అచలాన్ని స్పృశించకవున్నది । ఆఅచలం మూలంలేనియీగుర్తెరిగే శరీరాన్ని తగలక వున్నది । దానిపేష్యం దీనికి లేదు।దీనిపేష్యం దానికిలేదు। దాని క్రిందిదియిది గాదు।దీని క్రిందిదిఅదిగాదు। అది శాశ్వితంగావుండేది । యిది యేమీలేదు । వెనక యేమీలేదు । ముందర

యేమీలేదు। పున్నట్టేవుండేది। వెంటనేయేమీలేదు।విత్తనంలేనిచెట్టు। యింత నమ్మదగంది యేదీలేదు। మూలంలేని యీగుర్తెరిగే శరీరమే అనేక అవతారాలు యెత్తినదప। పుట్టనిచావని అచలం యన్నటికి। పుట్టదు। చావదు॥

* ఇతి శ్రీమద్గురు శివరామదీక్షిత ప్రభావే వేదాంతవిచారణే*
ఉమామహేశ్వరాఖ్యకృత భ్రాంతిరహిత ప్రకరణం॥

*ఆనందానుభవము*

* ద్విపద॥ *

నాయార్తి దీర్పుమన్న నుగురుండలారి*ధన్యుడనై తివిషరణీసురేంద్ర*
మాన్యుడవేనూకుమామాటవినుము*యెన్నాళ్లు దేహంబులెత్తుచునుండు*
నన్నాళ్లుసుఖములేదా చేతనునకు*తల్లి శోణితమును తండ్రిశుక్లంబు*
అల్లి బిల్యగుచుపిండాంకురంబైన * ఆపిండమందుదానావిర్భవించి*
యేపుత్రోతనజనయిత్రిగర్భమున * పెరుగుచుకొన్నాళ్లు పేర్చియాగర్భ*
నరకంబుగుడిచి యంతటనిర్గమించి * మంచంబులో బడి మలమూత్రతతుల*
ముంచినయందులో మునిగి తేలుచును * సంకటంబులు శోయుజాలకఅంటి*
కింకలుగుడుచునీకిరియనుకొన్నాళ్లు * తీటవుక్కసదగ్గుతిమ్మిరియమ్మ*
స్ఫోటకంబులుజ్వరంబునుకూనలును *సంధులుముట్టుదోషములుకొన్నాళ్లు*
పొందినదుఃఖంబు పొందుకొన్నాళ్లు * ఆమీదనవయవ్వనారంభుడగుచు*
కామించివేశ్యలక గిల్లుమరగి * పొగరునదిరుగుచు పుస్తుబూచులును*
తగిలిగొన్నాళ్లుఖేదంబునుగుడుచు * అంతటపెండ్లాడిఆలుబిడ్డలను*
సంతరించుటకువేషములుధరించి * యాచకవృత్తుల వ్యవసాయములు*
పాచకవృత్తుల పారుపత్యముల * సుంకపుద్యోగాల జూదాలహీన *
కైంకర్యములకొంత గాలంబునరయు * వార్ధికంబునతల వణికించుకొనుచు*
ఆర్థిదోచుచుజనులందరురోయ * యొందుకుకొరగాక యింటిలోనొక్క*

గొందినికుక్కలో గూలదోయగను * అంత్యగాలమెరింగి యమునికింకరులు*
చెంతల జేరిభర్జింప నెమురచి * యమపురంబున కేగి యాతనల్ గుడిచి*
క్రిమునునసికీతి క్రిమ్మరబుట్టి * యిట్టిపుట్టువుచావు లెన్నియో లెక్క*
పెట్టశక్యముగాదు పెక్కండ్లకైన * హాయియెన్నడు లేదు అక్కట దేవా*.
కీయపార క్లేశ మెట్లు జెప్పుదూను * దేహసంబంధంబు దీర నగాని*
దేహికిసుఖపడ తెరువు లేదొకటి*

## * భద్రాద్రి రామశతకము. *

### గురుడుబోధించేక్రమము.

సీ॥ యమమునియమమాసనములు ప్రాణాయామ। మమర ప్రత్యాహారమంచితముగ॥
ధ్యానధారణసమాధ్యష్టాంగయుతమంత్ర। యోగములయహటయోగములును।
రాజయోగంబుతారకముసాంఖ్యమనస్క। ములునుముద్రలులక్ష్యసాధనములు
వరతత్వమస్యాదివాక్యముల్ జీవేశ్వ। రైక్యసంధానమురాజితముగ।
గీ॥ శిష్యునకు దెల్పిగురుమూర్తిస్థిరముగాను। పూర్ణభావంబుబోధించుబుధులు మెచ్చ।
రమ్యగుణధామభద్రాద్రిరామపరశు। రామనరసింహదాససంరక్షితాంహ్వ॥

### భావార్థము.

తా॥ యమ నియమ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధ్యష్టాంగ యోగములును, మంత్ర,లయ,హఠ,రాజయోగములును,తారకసాంఖ్య అమనస్కములును, ఆసనముద్ర లక్ష్యాభ్యాసములును, జ్యోతిదర్శనమును, మహావాక్యార్థ లక్ష్యార్థములును, క్రమముగా సద్గురుమూర్తి శిష్యునకు బోధించితదుపరి పెద్దలుమెచ్చునట్లు పరిపూర్ణబోధనుదెలిపికృతార్థుని జేయును.

## * పురూరవనారద సంవాదము. *

గీ॥ అడిగితివి వేదశాస్త్రసారాంశమైన। యట్టిపరమరహస్యమో యవనినాధ।
అడుగుదురుగాని ధర్మకామార్థఘనతు। లడుగరెవ్వరు నిబ్బంగినాత్మవిద్య॥

శా॥ అజ్ఞానంబునఁదోచు సంసరణదుఃఖావాప్తియజ్ఞానమా।
త్మజ్ఞానంబుననాశనంబగు తదాత్మజ్ఞానమైయీశ్వరా।
నుజ్ఞంగానిఘటించఁదీశ్వరుఁడు సంతోషించు వేదోక్తముల్।
స్వాజ్ఞన్ వర్తిలుధర్మముల్ నరుఁడకర్తైచేయుసద్వృత్తికిన్॥

ఉ॥ కావునకర్మనిష్ఠగత కల్మషుఁడైనముముక్షుఁడీయవి।
ద్యావరణంబుబాసి సముదంచితబోధమునొందుబోధ।
లీలావిభవంబుచేత సకలంబునుబ్రహ్మముగానెఱుంగు।
తద్భావననిశ్చలంబైన బ్రహ్మముదానగునిర్విశేషతన్॥

వ॥ నరేంద్రా! అద్వితీయంబును నపరిచ్ఛిన్నంబును నాద్యంతరహితంబును సచ్చిదానందస్వరూపంబునునై శుద్ధచైతన్యంబైన బ్రహ్మం బొక్కటియై వెలుంగుచుండు నట్టిబ్రహ్మంబునందు మధ్యస్థయై యనాదియై మిథ్యాభూతయై తచ్ఛక్తియై త్రిగుణాత్మికయై యనిర్వచనీయయై కలుగుదోచు మూలప్రకృతి యావస్తువయును తదాశ్రయత్వ తద్విషయత్వ బలంబునుచేసి వస్తువుంబోలి ప్రకాశింపుచు నాత్మసత్తాస్ఫూర్తులవలన స్ఫురద్రూపంబై యావరణవిక్షేపంబులుఁబొల్చియుండు నట్టిప్రకృతి సాత్త్వికగుణ ప్రకాశంబువలన మాయయనంబడు నమ్మాయయందు ప్రతిఫలితంబగు చైతన్యంబును మాయాధిష్ఠానచైతన్యంబును నంమాయయుంగూడి కారణోపాధికుండైన ఈశ్వరుండై సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ సర్వనియంతృత్వాది ధర్మంబులుగల్గియుండు నయ్యీశ్వరుండు తమోగుణప్రకాశినియగు మాయనీక్షించినందత్యంత కల్పనావశ్యంబున శుక్తియందు రజతాద్యారోపణంబును రజ్జువునందు సర్పాద్యారోపణంబును స్థాణువునందు పురుషాద్యారోపణంబును దోచుకైవడి భ్రాంతికల్పితంబులై మహదహంకారంబులును శబ్ద స్పర్శ రూప రస గంధ సమేతంబులై, త్రిగుణాత్మికంబులై, గగన పవనాగ్ని జల భూతత్త్వంబులను ద్రవ్యంబులుసంభవించె, నవిసూక్ష్మ భూతంబులనంబడు నాభూతంబులు పంచీకృతంబులై యన్యోన్యభాగ మేళనంబున స్థూలభూతంబులయ్యె నాస్థూలభూతంబులవలన స్థూలశరీరంబును సూక్ష్మభూతంబులవలన సూక్ష్మశరీరంబును

మాయవలన కారణశరీరంబునునయ్యె నిట్లు సమిష్ట్యుపాధులైన ఏతత్త్రయం
బును నీశ్వరుండు క్రమంబున విరాట్టును హిరణ్యగర్భుండును నవ్యాకృతుం
డనుసంజ్ఞల నొప్పుచు నవాంతర సృష్టి స్థితి ప్రళయనిమిత్తంబున రజ స్సత్త్వ
తమోగుణావలంబనంబున బ్రహ్మ విష్ణు రుద్ర రూపంబుల గ్రీడించుచుండు
నిదిసమష్ట్యుపాధికుండైన ఈశ్వరుని ప్రకారంబింక వ్యష్ట్యుపాధికుండైన జీవుని
ప్రకారంబువినుము ప్రకృతి రజస్తమోగుణప్రకారంబున నవిద్య యనంబడు
నవిద్యారూపంబున నంతఃకరణంబునందు ప్రతిఫలితంబైన చైతన్యంబును
నంతఃకరణాధిష్ఠాన చైతన్యంబును నయ్యంతఃకరణంబునుం గూడి జీవుం
డను సంజ్ఞగల్గి యవిద్యావశతం గార్యోపాధికుండై స్వరూప విస్మృతినొంది
కించజ్ఞుండై యుండు నట్టిజీవునకు స్థూలభూత జన్యంబై జ్ఞానేంద్రియకర్మేంద్రి
య పంచప్రాణ మనోబుద్ధి రూపంబైన స్థూలదేహంబును నవిద్యారూపంబైన
కారణంబునుంగల్గియుండు నందు విశ్వ తైజస ప్రాజ్ఞ సంజ్ఞల జాగ్రత్స్వప్న
సుషుప్త్యవస్థలయందు ప్రవివిక్తానంద భోగంబు లనుభవించుచు జీవాత్ముండ
హంకార రూపుండై కర్తృత్వ భోక్తృత్వాది ధర్మంబులు తనయందారో
పించుకొని నయ్యవివేకంబువలన నభిమానంబును నభిమానంబున రాగద్వే
షాదులును రాగద్వేషాదులవలన కర్మంబులును కర్మంబులవలన దేహంబు
లును దేహంబులవలన సుఖదుఃఖాదులు సంప్రాప్తంబులగుచుండు నిట్లు
పారంబులేని సంసార పారావారంబున కడగానక భ్రమింపుచుండు నందు
నొకానొక పురాకృతవిశేషంబున బహుజనంబులలో నొక్కరుండు సంసారని
వర్తనివర్తనంబునకు నుద్యోగియగు నట్టివాడు సత్సంగంబువలన సన్మార్గ
వర్తియై పాపంబులబాసి జ్ఞాననిష్ఠుండగు జ్ఞాననిష్ఠవలన చిన్మాత్ర వ్యతిరిక్తం
బైన వస్తువెద్దియుం గలుగదనియును కల్గినయట్లు దోచుచున్న సకలజగం
బును నెండమావులు జలంబులై దోచినకైవడి మనోవిభ్రాంతి కల్పితంబని
యును దెలిసి కార్యకారణోపాధులుమిథ్యలగుటం జేసి ఈశ్వరత్వ జీవత్వంబు
లసత్యంబులని ఘట మఠోపాధ్య భావంబునం దంతర్గతాకాశంబును నేకం
బైనయట్లును సూత్రింబైనయాత్మ యొక్కటియును నిశ్చయంబున బ్రహ్మైక్యా

నుభవంబునం దన్మయుండై యుండు నతండు జీవన్ముక్తుండై ప్రారబ్ధక్షయానం
తరంబున విదేహకైవల్య ప్రాప్తుండగునని వెండియు నిట్లనియె.

శా॥ నామంబుల్ మరిరూపముల్ క్రియలునానాభంగులందోచు।
నిద్రామోహంబునస్వప్నముంబలె నవిద్యంజేసి సత్యంబుగా।
వేమిన్ జ్ఞానికిఁదోచినట్లైన బ్రహ్మభూతమైయుండునో।
భూమీశోత్తమ చిన్మయంబుసకలంబున్ లేదు లేదింతయున్॥

కం॥ చిత్తనియెడుసాగరమున*చిత్తంబనువాయువశత*సృష్టితరంగో*
త్పత్తియగుచిత్తమణగిన*యుత్తరజగమణగుముక్తి*యనునదియొకదా॥

కం॥ ఏలాపలుచదువులుబ్రం*హ్మలోకనసుఖముఁదనకు*ననుభవమగునా*
కీలెరుగుటమే లెరుగుట*భూలోకసురేంద్రసూక్ష్మ*బుద్ధింగనుమా॥

కం॥ ఆరూఢుడుముక్తినగా*గారూఢుండారురుక్షు*డారోహణకా*
ర్యారంభపరుఁడుగావున*నారెంటికిగలదుభేద*మధికారములన్॥

గీ॥ కామికతన్ యుగాక సత్కర్మములనీశ। వార్పణంబుగ జేయుచునారురుక్షు।
డరయనారూఢుడగుచుకాలాంతరమున।నపుడుకర్తవ్యమతనికెయ్యదియు లేదు॥

ఉ॥ మాటలువేయునేల యొకమర్మముదెల్పెదమోక్షదాతలై।
పాటిలువిష్ణుశంకరుల భక్తిదృఢంబుగగల్గెనేని।
నానాటికివానికన్ని సుగుణంబులుతానెఘటింపముక్తుడౌ।
బూటకపువిచారముల బోవగనేమిఫలంబుభూవరా॥

కం॥ సగుణమెఱింగిభజించిన*నగునిర్గుణసిద్ధిసిద్ధు*డగునాతనికిన్*
జగమెల్లనుబ్రహ్మమయం*బుగదోచునుసార్వకాల*మునన్నొక్కగతిన్॥

సీ॥ బయలసంరంభిలోపలసంరంభియై । కార్యతంత్రంబులుగడుపునేని ।
సఫలప్రయత్నంబు విఫలప్రయత్నంబు । తనకుతుల్యంబుగాదలచునేని ।
యనివార్యమైకర్మమునవచ్చుసుఖమున । జెందినయట్లుభోగించునేని ।
సౌఖ్యంబుకష్టంబుసంప్రాప్తమైనచో । నుబ్బుస్రుక్కులులేకయుండునేని ।
గీ॥ జీవపరమేశ్వరైకసచ్చిత్సుఖాను । భూతినిస్సంశయాత్ముడై పొలచునేని ।
యతడుప్రారబ్ధమునవ్యవహారియైన । ముక్తిసామ్రాజ్యమూర్ధాభిషిక్తుడౌను॥

చ॥ వనముననున్న నేమి గృహవాసము జేసిననేమియాత్మభా ।
వనయునసంగవృత్తి యరివర్గజయంబునుగల్గియుండినన్ ।
వనముననున్న నేమి గృహవాసము జేసిననేమియాత్మభా ।
వనయునసంగవృత్తియరివర్గజయంబునులేకయుండినన్ ॥

క॥ దేహముతాగాననినిజ*మూహింపగనేర్చునట్టి*యుత్తమునకుత*
ద్దేహమునకైనబాంధవ*దేహంబులుమిథ్యలనుచు*దెలియంబడదే॥

సీ॥ పుత్రపౌత్రకళత్ర మైత్రీ ప్రవర్తిలు । వశిష్ఠసంయమిబ్రహ్మనిష్ఠవినమె ।
కర్మతాదులురాజధర్మమునచరియించు । జనకునియద్వైతచర్యవినమె ।
వాణిజ్యవృత్తిజీవనుడైనయులతులా । ధారుణిపూర్ణబోధమునువినమె ।
కటికకాయుకముచేకాలంబుగడుపుధ । ర్మవ్యాధువిజ్ఞానమహిమవినమె ।
గీ॥ వారుప్రారబ్ధముననుండవలశెజ్ఞాను । లట్టివ్యవహారముననున్న నేమికొదువ ।
జ్ఞానవైరాగ్యనిశ్చలానందపూర్ణు । లైనవారలుజీవన్ముక్తులగుటనిజము॥

కం॥ యేయాశ్రమముననుండిన* నాయాచారములనడువ*కాశ్రయసుఖత్వ*
జ్ఞాయత్తమతనివంచకు*డయ్యేనునిష్కర్మనసుట*నర్థముకాదే॥

ఉ॥ కర్మముబంధకంబనిసుకర్మముమానిసుఖంబుగోరిను ।
నిష్కర్మముసేయుచున్ బుధులుగాదనినన్ వినకాత్మకున్నదే ।
కర్మములంచుతాజెడుట కాకొకకొందరజ్ఞాననిష్ఠకున్ ।
కర్మఫలాప్తికింజెరుచుకాపురుషుండుపదేష్టసంబుని ।
నిష్కర్మకినాస్తలేదు భయకర్మములున్ విధిచేఘటించినన్ ॥

శా॥ జ్ఞానారూఢుడు బాహ్యచేష్టల మనస్సంకల్పుడై చేయునే।
మైనన్ ప్రాకృతునట్లవానిగని తానా చేష్టలే శేయగా।
బోనల్పొత్తులు వంచనల్ మదిదలంపుల్ మానకారూఢుడం।
నేనంచున్ ఫలమేమి చేష్టలమదిన్ నిశ్చింత లేకుండినన్॥

గీ॥ మనసు చల్లబడక మాటలెన్నాడిన। ముక్తిగాదు వాదశక్తిగాని।
మనసె కారణంబు మరిబంధమునకుమో। క్షమునకనుచు దెల్పు చదువ విన వే॥

కం॥ జ్ఞాతృజ్ఞాన జ్ఞేయము*లే తెరగున వేరుదోచ*కేకంబుగ న*
ద్వైతాత్మత వెలుగు ప్రపం*చాతీతుం డెవ్వడత డె*యారూఢుడిలన్॥

కం॥ యిదినగరమిదియరణ్యం*బిదిసౌఖ్యంబిదియసౌఖ్య*మీతడుపురుషుం*
డిదిసతియనితోచినయ*య్యదిజూచినబ్రహ్మమయము*యారూఢునకున్॥

గీ॥ సంగమునుసర్వమునుగల్గిసంగిగాడు। భోగములుసర్వమునుగల్గిభోక్తగాడు।
కార్యములుసర్వమునుజేసికర్తగాడు।విగతసంకల్పుడగుబ్రహ్మవేత్తయాధిపా

గీ॥ యిచ్ఛలేనివానియింద్రియంబులుకర్మ। వశతచేస్వభావవర్తనముల।
మెలగుచున్ననేమియిలపుణ్యపాపంబు। లంటవతడకర్తయగుటనతని॥

గీ॥ నిర్విషయచిత్తుడగుబ్రహ్మనిష్ఠునకును।తనుసుఖంబులుప్రారబ్ధమునఘటించు।
మాత్రమేకానియందేలమగ్నుడగును। జలజపత్రంబుమునుగునేజలములందు॥

గీ॥ శయ్యనుండియుపెక్కుదేశములవెంట। దిరుగకలగాంచుచున్ననిద్రితునిభంగి।
సచ్చిదానందుడయ్యుతాజననమరణ। బాధలనుబొందినట్లుంటభ్రాంతికాదె॥

కం॥ కలలోననరకులాడిన*గలవేగాయములుమేలుకాంచినమేనన్*
తెలియకమునుపటిసంస్మృతి*కలకలువిజ్ఞానికేల*గలుగందోచున్॥

కం॥ ఆయురుకవారుకుకారకుగ*దాయోగజపాదినిష్ఠ*లాయరుకదృఢం*
బైయున్నయతిమక్రియలం*జేయదులోకోపకృతికి*జేశినజేయున్*

మ॥ తొలుజన్మంబులనైనయిప్పుడైనం బుణ్యకర్మనిష్ఠాలికం ।
బిలబ్రహ్మార్పణసత్క్రియామహిమచే నంతఃధృతిం జేసి ।
నిర్మలులై సంశ్రవణంబుతన్మయము దావాప్తింనిదిధ్యాసలున్ ।
సులభంబౌ శ్రవణాదుల ప్రక చెలించున్ దామసత్యాగతన్ ॥

కం॥ యీమేననుసత్కర్మము * లేమియు జేయక నెపొందు * నీకి జ్ఞానం *
బానునుపటిభవమునుని * ష్కామసుకర్మాప్తివిగత * కల్మషుడైనన్ ॥

ఉ॥ జేయుమసత్క్రియల్ బయలజేశినయట్లు సుఖించులో ఫలన్ ।
శేయనుసౌఖ్యముల్ బయలజేయని యట్లుసుఖించులో ఫలన్ ।
శేయుడుకృత్యముంచు మరిచేశినకృత్యమటంచు నెంచరా ।
దేయడబ్రింహ్మవిద్యతుద కెక్కినయట్టిమహానుభావునిన్ ॥

చ॥ అమితములై ఘటించు విషయానుభవంబుల భోగియయ్యు ।
నుత్తముడగుయోగి బ్రంహ్మమయుతన్మది రంజిలుచుండుగీత ।
నృత్యములనుదానమానవశుడయ్యు శిరస్థితపూర్ణకుంభమున్ ।
సమధికయుక్తినిల్పుకొన జాలిననాట్య ధురీణుకైవడిన్ ॥

గీ॥ తలచినతలంచకున్న నిత్యప్రబోధ । పూర్ణుడగుతానుతాగాక పోవుటెట్లు ।
యెరుగదగుతనగురికందెవెన్నడిలేక । యెరుకమరుపులనేమైనయెరుక లేక ॥

వ॥ అని తెలపి వెండియునిట్లనియె.

ఉ॥ కోరకుమేపదార్థమును కోరినవచ్చునెరాసివస్తుల్ ।
కోరకయున్న రావె తనకున్ లభియించగనున్నయర్థముల్ ।
కోరినరానిచో గలిగి కోల్పడుచో వెతగానసజ్జనుల్ ।
గోరరనాస్థప్రాప్తములు గొందరుకుందరు వస్తుహానికిన్ ॥

శా॥ ప్రారబ్ధంబునమేన నేమనభవంబొందుచుందదత్సాక్షివై ।
యామూహస్థితి సర్వకాలముల సర్వావస్థల్ంజిత్సుధా ।

ధారాపానసుఖాప్తిసర్వగత శుద్ధబ్రహ్మమేనంచునం ।
కారాహిత్యమునందు మీరుదియె మోక్షప్రాప్తిభూవల్లభా ॥

సీ॥ ఆసక్తిలేకయత్నాయత్నతఘటించు । ననిషేధసుఖముల ననుభవించు ।
ప్రారబ్ధవశతనాపద సంపదలువచ్చు । నగపుసుఖ్బను మదిదగలనీకు ।
కర్తవుగాకలౌక్యములు శాస్త్రీయంబులైనట్టియుచితకార్యమును శేయు ।
మాత్మనిశ్చలత నద్వైతివైయుండి । కృత్రిమద్వైతివైకొడసల్పు ।
గీ॥ పొడమునజ్ఞానమునుజ్ఞానమునసుబోవ । నఖిలసంసారమునుమిథ్యయనియెరుంగు ।
సచ్చిదానందనిధియవస్థాత్రయైక । సాక్షివీవౌటదెలియుము మోక్షమిదియె ॥

గీ॥ సకలమునుచిన్మయముగదృశ్యములుమదికి । దృశ్యములుగదలంచినస్పృహాతకార్య
వస్తువైదైవగతినేలవలయురాజ్య । మేలుమనహంకృతిని శంకయేలనీకు ।

చ॥ అనిమునిపుంగవుండు నిగమాంతరహస్య సమగ్రవాగ్రసా ।
యనముకృపామతింహిముక రాన్వయకర్ణపుటంబులందునిం ।
చినబహుజన్మభాగ్యమున జేశియువిద్యదొలంగి సత్యమై ।
యనుభవమయ్యెనాత్మ చిదహంబనుసంస్మృతిసుస్థిరంబుగన్ ॥

వ॥ ఇట్లు పరమజ్ఞానసంపన్నుండైన యమ్మహామునీంద్రునుపదేశంబున నాన్నృపాల శేఖరుండఖండ సంవిత్పరిపూర్ణుండై యానందంబున నతనికి సాష్టాంగవందనంబులుచేశి యనేకవిధంబుల బ్రస్తుతించె, నారదుండతని మనీషా విశేషణంబునకు సంతోషింపుచు బహుభంగుల నాశీర్వదించి వీడ్కొని స్వర్గగమనోన్ముఖుండయ్యెనట నారదుండుచనుచున్.

## * రామ స్తవరాజము *

సీ॥ స్వస్తికారోహణ స్ఫురిత వేదాదీక్ష । లీమూడుదీక్షల నెరుగవినుము ।
మొదలసిద్ధాసనమున నుంచిమరిశిష్య । నాసటిపాత్రనుమడిచిభశితరేఖ ।
యాగమాక్తికదీర్చి యాదలచెయిజేర్చి । యంతట తెల్పి నీవనుచుదెల్పి ।
కణగిట్లుత్రివిధ దీక్షాపరికారంబుగా । కారణగురుమూర్తి కరుణశాయు ।

గీ॥ రాజయోగసమాధిసామ్రాజ్యసౌఖ్య । వార్ధిఁ దేలాడుచుండెడువారలకును
యెన్నటికిహానిలేదయా మున్నుపీరి । సన్నుతులువిన్నఁజాలదేజన్మఫలము॥

ఉ॥ యోగతిదెల్పమానికి నరేంద్రుడుబల్కెమహాత్మతారకా।
యోగమునంటిరాజ శివయోగసమాధులుశేయువేళన।
క్లేగురుభక్తుడేమిగను నట్లదియంతయు జెప్పుమన్నవే।
దాగమశాస్త్రసమ్మతి రహస్యము తేటగ వ్యాసుడిట్లనున్॥

సీ॥ సిద్ధాసనస్థుడై శ్రద్ధాసమృద్ధితో । ముక్కుచాయకు తాకింత నిక్కదోప।
కన్నులు దెరచియుకదియంగ గీలించి । కనుచూపు మేరగన్గంటనూది।
పట్టువిడుపులులేనిబయలల్లకబలించి । యందులోగట్టుగాబాంధిద్రోశి।
నిల్చుచూపరి తెల్వినిండిపారగబయల్ । పిండారబోశినట్లుండునపుడు।
గీ॥ యెరుకపడ్డవాడు నెరిగించుకొనువాడు । నెరుగువారు లేక నెరుకగాక।
బ్రతుకుబయలుబట్టిపరదేశిపతుడైన । మహానివెలుగుచిత్సమాధినపుడు॥

సీ॥ చిత్సమాధినివల్ల శివయోగిమదిలోన । సాఖ్యసారజ్ఞప్తి సంభ్రమగుచు।
వెలుగునునదివేద వేదాంతమహావెల్గు ఘనసుభవవేద్యంబునైనవెల్గు।
వాచామగోచరంబై చలంగడివెల్గు । రెండైనకనరాకనుండువెల్గు।
సత్తైనగురుపూజసంతరించినవెల్గు । యింతరులాసపడంగనీనివెల్గు।
గీ॥ కంటిసాకానవన్నది గానివెల్గు । కలదులేదనువనువనుగన్నవెల్గు।
రాకపోకలుచెప్పంగరానివెల్గు । యనఘునీలోననినునీవెకనువెలుగు॥

శా॥ నూపవ్యాప్తములేనివెల్గు మదిలో నన్ వెల్గుయోగీంద్రస।
ల్లాపంబైనవెలుంగు సద్గురుకృపా లాలిత్యమహావెల్గుని।
ర్లేపాంతఃకరణాకృతిన్ వెలుగు తెల్విన్ బల్మిమహావెల్గు।
లోలోపలనే వెలుంగుచుయూవెల్గు నీలో వెల్గుధాత్రీశ్వరా॥

శా॥ లోలోనన్ దగలోకమహావెల్గుముల్లోకేశ్వరాతీతమహా।
బైలాచార్యకృపాకటాక్షమున సంపాదింపనా తెల్వియూ।

త్మాలోలాత్మకబోధమాయరుక యార్యస్తోత్ర మాచిన్మయం।
బైలీలంగనుసాఖ్యమాసుఖమునీవీక్షించుధర్మాత్మజా॥

* దండకము. *

శ్రీరాజయోగప్రబోధ ప్రసన్నస్వయం జ్యోతిరానంద పూర్ణ స్వరూపాను
సంధాన భోగావిశేషప్రవీణత్వ సంప్రాప్తచిద్రూప ధౌరేయుడై ధీరుడై
మించు నాసద్గురుస్వామినిన్ జేరి యాత్మాంగసంస్థాన సద్భావన శుశ్రూషలన్
మీఱశిష్యాధికారంబు వీక్షించి రక్షించు నాపేక్షతో నీతి వాక్యోపదేశాఖ్య
దీక్షాప్రకారంబునన్ దేహ బుద్ధీంద్రియప్రాణ సంసార ధర్మంబుపేక్షన్ వల
క్ష్యంబుగా జెప్పి తత్సాక్షివంచున్ ప్రమేయప్రమాణ ప్రమాతృప్రమా సాక్షి
కూటస్థ సద్బ్రహ్మ తత్త్వైక్య భావంబులన్ వేద వేదాంత మార్గంబులన్
దెల్పి యాతత్త్వమస్యాది వాక్యార్థముల్ ద్రోశి లక్ష్యార్థమా బ్రహ్మ సాక్షా
త్కరింపంగ యారాజయోగ ప్రకారంబునన్ వానిసిద్ధాసనాసీనుగా జేయు
చున్ ఫాలలాటంబునన్ భూతిచే రేఖగా దీర్చుచున్ మస్తకంబంటి యాజం
గమస్థావరాది ప్రపంచంబు విశ్వంభరంగల్పి యాభూమినిం వారిగా జేశి యానీ
రమున్ వీతిహోత్రంబులో నింకనాయగ్నియున్ గాలిని బోవ యావాయు
వాకాశమున్ జారగా శూన్యమార్గంబు హృద్వీధిలో గూర్చుచున్ యామ
దిన్ బుద్ధియాబుద్ధినిం జిత్తమాచిత్త మట్లాయ హంకారమందాయ హంకా
రమున్ జీవుడై నాతనందున్ మరిందన్ను బైలౌ పరబ్రహ్మమందైక్యముం జేశి
శ్రీచిన్మయానంద వారాశినోలాడుమంచున్ రహస్యామనస్క స్వరూపోప
దేశంబు సేయున్ సహస్రారమందా గురుధ్యానమున్ జేశి పూర్వోక్తమార్గం
బునన్ దృశ్యమెల్లన్ చిదగ్నిన్ బడన్ వేల్చియాత్మైక్యమున్ గాంచి యున్న ప్ర
పంచంబులున్నట్లులుండంగ తానన్నదిన్ రూప నామాదికంబన్నదిన్ లేక యా
మక్షికామత్కుణోపద్రవంబుల్ గనన్ రాక నిర్వాతదీపంబు చందంబునన్
దెల్వితోనుంట బ్రహ్మానుకూలంబటంచున్ మరిన్ దెల్పు శ్రీవ్యాసభట్టారకా
చార్యవర్యుల్ ప్రశంసింపుచున్ ధర్మపుత్రుండు తాద్రౌపతీ యుక్తుడై వేదవే

దాంతసిద్ధాంత శాస్త్రప్రకారాన యాచార్యపూజా ప్రకారంబు సాంగంబుగా
జేశి సర్వంబును గోసి తత్పాదపద్మంబుహృద్వీథిల్ డాశి పత్నీ సమేతంబుగా
ధర్మరాజాత్మ తత్త్వోపదేశంబు శ్రీవ్యాసమానీ ప్రసాదంబునన్ జేశి లో చూపు
వెల్ చూపులంగన్న కన్నాటమేల్కాంచి యేచూపులన్ జూపరాకున్న యా
చూపులో నుంచి యావెల్గు బోధా ప్రకారంబు తానై ఫలించంగ నిర్వ్యాజు
డై భోజుడై యోగనిద్రన్ మరిన్ గొంత శేపంతలో లేచి శ్రీ సద్గురుస్వామిన్
జేరి సాష్టాంగ దండప్రణామంబులుం జేశి యుత్సాహియై మీకృపన్ గంటి చి
త్సౌఖ్యమంచున్ మరిన్ సన్నుతుల్ జేశి యోగీంద్రచంద్రా చిదానంద సాం
ద్రా మహాయోగివర్యా సుఖజ్ఞప్తిధైర్యా నిజజ్ఞానచర్యా నమస్తే నమస్తేనమః॥

*సర్వార్థసార సంగ్రహము*

సీ॥ శ్రీమత్సదానంద సేవితాశ్రితబృంద । పురుషోత్తమముకుందమూలకంద ।
సకలమునిస్తోత్ర సగుణనిర్గుణగాత్ర । ధన్యచారిత్ర సంతతపవిత్ర ।
శమదమాదినివేశ శాత్రవౌఘవినాశ । సాధుజనాధీశ సత్ప్రకాశ ।
బ్రహ్మమార్గాచార భవభయసంహార । నిత్యదయాపూరనిర్వికార ।
గీ॥ జ్ఞానసంపన్న సత్యదాసప్రసన్న । చిరతరాత్మైక్య మానసచిద్విలాస ।
పరమదీనశరణ్య సద్గురువరేణ్య । ధ్యానయోగనిధానమౌనమస్తే ।

కం॥ వందనముభక్తవత్సల*వందనముదయాసముద్ర*వందనమనఘా*
వందనము మోక్షదాయక*వందనమి దెవిమల నామ*వరగుణధామా॥

గీ॥ అనఘమిమ్మునుతి జేయుటకజునకైన । శివునకైనను శ్రీరమాధవునకైన ।
వశముగాకుండు నే నెంతవాడనింక । జ్ఞానహీనుడమూఢుడజాడ్యమతిని॥

గీ॥ దేశికోత్తమబ్రహ్మప్రకాశవస్తు । వవనిమీదటమీరూపమైజనించె ।
తెలివిమాలినమావంటి దీనజనుల । నెల్లరక్షించికరుణచేసే లుకొరకు॥

గీ॥ అమృతముండంగనాకటూనలశినట్లు । గంగయందుండిదప్పి చేగనలినట్లు ।
మీపదాంభోజముల చెంతమెలగుచుండి। పరమమూఢుడనై యుంటపాడియగునె।

మ॥ తడవాయెన్ భవదంఘ్రియుగ్మముల చెంతం జేరియిప్పాటికిన్ ।
విడదాయెం దగులొందిమాయ నిజమౌ విజ్ఞానసన్మార్గమే ।
పడదాయెన్ వలగొన్న విభ్రమము చే భావంబు బద్ధస్థితిన్ ।
జడదాయెన్ గడతేర్చ భారకుడవే చందంబునన్ బ్రోచెదో॥

క॥ నీకే తెలుసు మనన్నిక * జేకొన్నందులకు జడుని * జేయవలదు నా *
వ్యాకులమేమనవలెనవి * వేకంబు నినించుకైన * వివరమెరుంగన్॥

క॥ మీవంటి ఘనుల దగ్గర * మావలెనగు మూఢులు నికి * మార్గంబరయన్ *
పావనిమై చెలువగు గో * దావరిలో చట్టురాళ్ళు * తగనుండుగతిన్॥

చ॥ అరయ సమస్తజన్మములయందు దలంప మనుష్యజన్మమే ।
యరుదు మనుష్యజన్మములయందు విశేషపుజన్మమెత్తగా ।
నరుడు విశేషజన్మములయందున బ్రాహ్మణజన్మమెత్తగా ।
నరుడగు నిట్టిజన్మము నిరర్థకమౌట వివేకహానియున్॥

గీ॥ అరయ నిదిగాక కాయంబు నస్థిరంబు । నెప్పుడే వేళ బోవునో యెరుక లేదు ।
గాన జాగ్రతదప్పుట కార్యహాని । జాగుసేయక రక్షించు సదయహృదయా॥

గీ॥ అనిమనోలయుడీరీతి యార్తుడగుచు । వినయము భక్తియును మీర విన్నవింప ।
వినికృపాయత్తచిత్తుడై మునివరేణ్యు । డగు సదానందుడిట్లనె నతనితోడ॥

క॥ నీవింత నెమ్మనంబున * ధావంతము నొందనేల * తడవాయనుని *
శేవకు మెచ్చితి నేటికి * భావము పరిశుద్ధమయ్యె * పరమవివేకా॥

క॥ యెక్కువగు నార్తిజూడక * నిక్కువ లెరిగింపగూడ * దేస్థితికైనన్ *
తక్కినరీతి దిగాదిది * నిక్కముగ బ్రహ్మతత్వ * నిర్ణయమగుటన్॥

సీ॥ విమలపూజాకోటి సమమేక స్తోత్రంబు । స్తోత్రకోటి సమంబు సురుచిరముగ ।
జపమొక వారంబు సలుపుట జపకోటి । సమము ధ్యానంబొక సారి జేయ ।

ధ్యానకోటిసమంబుదనరగావిలయంబు। నొక్క-ముహూర్తకాలంబునొందుఫలము।
నిదియునిరంతరమెడయక నొనరింప। నమనస్క-మనజనునతిశయము౯।
గీ॥ నిదియుకారణంబునిదిదప్పనింకలే। దిదియె కేవలాత్మ నెనయునట్టి।
నిజసమాధిదీని నెళవెరుంగుటకున్నె। సకలతపములెల్ల సాధనములు॥

* జ్ఞానాంజనేయము. *

కం॥ యీరీతిబ్రహ్మతత్వం*బారయనీమంతు డెరుగు*నహంబుండగుటన్*
నారదుడొకబ్రాహ్మణునకు*సారముగాతత్వవిధము*సకలముదెలిపెన్॥

కం॥ మునులారమీరుబల్క-న*ఘనప్రశ్నయుపరమయోగి*గణముల కెల్లన్*
ఘనమైనయోగమిదియగు*వినదగుమీకెల్ల నేను*వినుపింతుదగన్॥

వ॥ అని యిట్లనియె మునులారా మీరునన్నడిగినయర్థంబు పరమరహస్యంబును పరమ యోగివిలాసంబును పరా పరమూలంబును నగు యీయర్థంబుతొల్లి సత్యవతీనందనుండైన వ్యాసభట్టారకుండు నొక్క-నాడేకాంతంబున సంక్షేప రూపంబుగా నాకు నెరింగించె నదివినుండు సకలప్రపంచంబు మనోవికారంబు గావున మనస్త్యాగంబు శాయవలయు.

సీ॥ యిలలోనమనుజులుయీయర్థమెరుగక। శాస్త్రపురాణముల్ చదివిచదివి।
తామునేమనియెడితనహంకృతులబొంది। మానావమానముల్ మదిని నిలిపి।
భేదవాదములచేపెనగొనుమదిలోను। క్రోధమెల్లెడలనుగూర్చినిలిపి।
అన్యాయవిత్తంబులార్జించిగృహమందు। న్యాయమహాపుణ్యంబునడుపలేక।
గీ॥ విషయసంఘంబులందులవిభ్రమీగి। పరులకునువాచకజ్ఞానబలముజూపి।
తమునమదిలోనకించిత్తునడువలేరు। అట్టిమనుజులవెర్రియేమనగవచ్చు॥

వ॥ అదియునుంగాక.

సీ॥ మొదలుయీదేహంబుమీదకిచర్మంబుపై। కప్పుకయుండునుయొప్పుగాను।
నరములుయముకలుపరగంగకండలు। ప్రేవులురోమముల్ బెరశియుండు।

రక్తంబుమాంసంబు రమణాశ్లేష్మంబు । కఫపిత్తములచేతగప్పియుండు ।
యిన్నింటితోఁగూడియుండుటదెలిసియు । యేహ్యమాననిమదియెంచలేక ।
గీ॥ సుఖముకష్టంబులోనుగాఁజూచుచుండి । ఘటమునిత్యమటంచునుకాంక్షజేసి।
మురికిదేహంబుపైచాలమోహమునను। పోలయునోయనిపోషింతురెలమితోడ॥

గీ॥ ఆత్మవిడచినదేహంబరక్షణంబు । వుంచుకోలేరు తమవారమంచువుండి ।
కరుణలేకనుగొనిపోయి కాల్తురెలమి । మోహపడినట్టిదేహ మేమయ్యెచెపుమా॥

గీ॥ తల్లితండ్రులుభార్యలుతమ్ములన్న । లాదిగాగలబంధువులెందరున్న ।
తనువువిడువగతనకడ్డపడగలేరు । యేడ్చుకొనుచుందురురిక్తవెర్రులగుచు॥

కం॥ తమవారికితమరేస్తురు*తమకేచ్చువారలెవరో*తలపగవలదా*
తమగతికేతమరేడ్వక*క్రమమొప్పనునొకనికేడ్వ*కారణమేమీ॥

గీ॥ సకలశాస్త్రంబులెల్లనుచదువువారు । ప్రేతకార్యంబులందులప్రియముజేసి।
శ్రాద్ధములుచేయుచుందురుచెప్పనేల । వారిశాస్త్రానుభావమేమనగనచ్చు॥

ఉ॥ పాపముపుణ్యమున్ దెలిసి పాపమెశేయుదురెల్లవారలున్ ।
యేపునశేయుకార్యములకెల్లనుపాపముయుంటయట్లనన్ ।
కోపమురాజుగాప్రననుగూర్చునుపాపముకోపమెల్లెడన్ ।
పాపములేనిపుణ్యములుపాల్పడజేసినవారలెవ్వరో॥

కం॥ పాపముపుణ్యంబనుచును*నేపారగవినుచునుండి *నిజముగదనలో*
పాపాత్ముడనుచుదెలిసిన*పాపములేదతనికతడె*పావనుడనఘా ॥

సీ॥ స్నానంబుసంధ్యయుజపముహోమంబును । వేదపురాణముల్ వివిధమైన।
శాస్త్రంబుయాగంబుజపముపవాసముల్ । వ్రతములుమతములువాదములును।
తీర్థముల్ యాత్రలుతీరునాళ్లమంత్రముల్ । పఠనపుస్తకములుపాఠవిద్య।
శిరియుచేభోగముల్ శేయుటదానముల్ । యిచ్చుటపుచ్చుటవితరణమును।
గీ॥ యిన్నిజేసినకీర్తియేయెంచిచూడ।మనుసుభ్రమచాతనగుచుండుమహినియిన్ని ।
మోక్షమియ్యగలేవయాముఖ్యముగను। తన్నుదా నెరుగవలెసుమీధన్యులకును॥

* కందార్థము *

౨౮* యేసాధననీకొంచుకు*పిసాసికిబనికి రాదువినుమాయయ్యా *నేసాధులచేవిన్నది* యేసాధనలేనిబోధ* నెరిగింతుపోకూ*సాధనలంద *మరిగీ తెరాకూ *యేసాధనలజోలి యేవోల్లననినీపు* బాసాజేశితి వేసిపరిపూర్ణబోధనే * నెరిగింతుపోకూ* సాధనలందు మరిగీ తెరాకూ॥

కం॥ సాధనలుజెప్పిశిష్యుల* బాధలబెట్టెటిగురుని* బాటనదలిమో*
బాధలునులే నిబోధను*సాధులశేవించివినుము*సద్గుణశాలీ॥౧౯॥

కం॥ నేపెద్దలచేవిన్నది*నీపైదయబుట్టిచెప్ప*నేబూనితినీ*
కాపద్ధతినంతయువిని* యేపద్ధతికాశపడకు*మిదివిడకుసుమీ॥30॥

* శ్రీ శివరామదీక్షితీయ్య మను బృహద్వాసిష్ఠం *
అచలబోధసిద్ధాంతం

యెప్పటిఅచలమేకాని। యేసాధన। యేశృతీ। యేయుక్తి। యేఅనుభవం। పనికిరాదు। మొదలుకొనాలేక తనకుతాను స్వతఃసిద్ధమై వున్నది గనుక। వున్నదేవున్నది అచలంగాక రెండోదానికి మూలంలేదు।ఇందుకు భూమండలమందు। భ్రాంతిలేనివారు వున్నారేమోఅని। వెతుక్కోవలెను। వెతికిచూచి, వారితో కూడావుండి। వారిజాడ కనుక్కోవలెను

౧ కనుక్కోక। మూలంలేనియీగుర్తెరిగేశరీరం। నేనుఅనినమ్మివుండెనా।అంతరమందు। గుర్తెరిగే మొముడుకవలెవుండిచస్తాడు
౨ బాహ్యమందు గుర్తెరిగే పందివలెవుండి చస్తాడు
3 వైరాగ్యంచేత సన్యాసంచేసితిరిగినా। గుర్తెరిగే। గాడిదెవలె వుండిచస్తాడు
౪ యోగాభ్యాసంచేసి తిరిగినా। గుర్తెగే దొమ్మరివానివలె। సాధించి। వొకనాడు పడిచస్తాడు
౫ వాయుధారణచేశినా। గుర్తెరిగే పామువలెవుండి చస్తాడు
౬ కర్మాలుచేశినా।గుర్తెరిగే।పంచబ్రహ్మాలవలె। చాకలవానివలె। మంగలవాని

వలె। కుమ్మరవానివలె। సాలెవానివలె। మేదరవానివలె। మాదిగవానివలె। వుండిచస్తాడు

యేమిచేశినా। మూలంలేని యీాగు ర్తైరిగేశరీరం యేమీా లేదుఅని। చేసినవాడే అచలుడు

యీాగు ర్తైరిగేశరీరం యేమీాలేదుఅని। సార్వకాలం యెడతెగక। నిద్రనచ్చినదనుక। ప్రతిదినం మరువక। చచ్చినదనుక। అభ్యాసంచేసినవాడు పుట్టినిచావని అచలమేకాని।మరివొకటికాదు।యిదినమ్మినవారికి।రాకడాలేదు।పోకడాలేదు

౭ యిదిగాక। మూలంలేని యీాగు ర్తైరిగేశరీరం చేసినమర్యాదవినెనా। గుర్తైరిగే పెద్దపులివలెవుండి చస్తాడు

౮ మూలంలేని యీాగుర్తైరిగేశరీరం చేసినది। యేదినమ్మరాదు। నమ్మినా। సంకెళ్లుతగిలినట్టే। మోక్షభ్రాంతిఅయినా। బంధభ్రాంతిఅయినా తగిలి। శాస్త్రవాసనచాత। లోకాంతరగమనమైనాతగిలి। దానంతవాడై। నరకమనేశరీరం విడువబడక మునిగేది। తేలేది। సుషుప్తిఅనే అంధకారంలో। సుఖమనే దురాశచాత। మూలంలేని యీాగు ర్తైరిగేశరీరంతప్పినా। తప్పకుండా। అతుకుపెట్టుకొని నేనుదొరనుఅనీ। గుర్తైరిగేయేనుగవలెవుండిచస్తాడు

* ఇతి శ్రీమద్గురు శివరామదీక్షితప్రభావే వేదాంతవిచారణే *

(చైతన్యనిరసన ప్రకరణము.)

* సీతా రామాంజనేయసంవాదము *

మ॥ ఘనతంతారకసాంఖ్యయోగములచే గష్టింపగానేలనే।
మ్మనముంబట్టగనేలనింద్రియములన్ మర్దింపగానేల।
చక్కనగాముందటగానుపించుఘటముం గన్నట్లు బాహ్యంబుగా।
దనుదాగాంచినయంతలో నిఖిలముక్ దానై వెలుంగుందగన్।

తా॥ అతిశయముతైన తారక సాంఖ్యనిష్ఠలచేత నెందుకు శ్రమపడవలయును మనస్సును నిలుపనేల జ్ఞానేంద్రియ కర్మేంద్రియముల స్వాధీనపరుచు కొనుటెందుకు అనగా బహుశ్రమతో తారకసాంఖ్యనిష్ఠయును మనోనిశ్చయంబును ఇంద్రియ నిగ్రహం

బును(వీటన్నిటిని)బొందుటకంటెను బాగుగా నెరుగనగపడుచున్న ఘటమునుజూచినట్లు తన్నుపరమాత్మగా తాగాంచి సంతటనే నామ రూపాత్మకమగు ప్రపంచ మంతయు తానైన పరబ్రహ్మమై ప్రకాశించునని తాత్పర్యము.

చ॥ వసరుచ్చు యేమియుఁ దినని వానికిమిక్కిలి వెక్కసంబుగా।
తినియెగపోయువానికిని తీరనినిద్దుర యెల్లప్రొద్దుపై।
కొనబడియుండువానికిని।కొంకక రేబగలొక్కరీతి మేల్కొ।
నినివసించువానికి నగోచరముల్ వరయోగలక్ష్యముల్॥

తా॥ ఓహనుమంతుడా?కృచ్ఛ్ర చాంద్రాయణ శివరాత్రి ఏకాదశి గోకులాష్టమి శ్రీరామనవమి మొదలైన వ్రతోపవాసములచేత పరితపించుచు ఏమియునుభక్షింపనివానికిని, మిక్కిలియెక్కువగాదిని ఉబ్బుసబ్బులకు రాకయుండువానికిని, ప్రొద్దు పొడుచుటను ప్రొద్దుక్రుంకుటను ఎరుగకనిద్దురమబ్బుతో ఎప్రొద్దునుపరుండి యుండువానికిని పగటియందును రాత్రియందును నిద్రలేకయుండువానికిని రాజయోగానుసంధానము లభింపదని తాత్పర్యము

క॥ యుక్తాహారవిహారుడు*యుక్తస్వప్నావబోధు*డురుకర్మములన్ *
యుక్తవిచేష్టుండగుఘన*యుక్తునకగుపరమరాజ*యోగముసుఖమై॥

తా॥ ఓహనుమంతుడా?"అతిసర్వత్రవర్జయేత్"అనున్యాయముచేత మితమైనభోజనమును సంచారమును నిద్రయును మేలుకువయును వైదిక లౌకిక కర్మములయందు మితప్రవర్తనమునుగల మహాపురుషునకు రాజయోగానుసంధానము లభ్యమై ఆనందమునుపొందించునని తాత్పర్యము.

సీ॥ వితతమైవిజనమైవిమలమైసుఖదమై। చెలగువివిక్తదేశంబునందు।
సమభూమియందు నిశ్చలముగామిట్టప। ల్లములుగాకుండ పేలవముగాగ।
వరుసకుశాజిన వస్త్రంబులనువుగా। బరచియొప్పుగవాని పైదిరముగ।
పూనిపద్మాసనాసీనుడై యామీద। కాయమధ్యంబునుగళముశిరము।
గీ॥ చక్కగానిక్కిదృక్కులుముక్కుచక్కి। జిక్కదక్కించితక్కినదిక్కుగనక।
మిక్కిలిదశేంద్రియంబులనొక్కజేసి।ఫలితముగయోగమభ్యసింపంగవలయు॥

తా॥ ఓ ఆంజనేయా? విశాలమై జనసంచారములేనిదై దుర్గంధములేనిదై నల్లులు దోమలు చీమలు మొదలగువాని ఉపద్రవములేనిదై యోగ శాస్త్రోక్తముగ నిర్ణయింపబడిన పర్ణశాల మొదలయిన వానియందు సమానమయిన నేలమీద కదలకయుండునట్లు మిట్టపల్లములులేకయుండునట్లును ఒత్తుకొనకయుండునట్లును దర్భాసనము కృష్ణాజినము వస్త్రమును అనువగా పరచి వానిమీద స్థిరచిత్తముగలిగి పద్మాసనముతో గూర్చుండి నడుమును మెడను తలను చక్కగా నిక్కించి యేతలంపులును లేక చూపులను కనుబొమల నడుమనిలిపి బ్రహ్మనిష్ఠను సలుపవలయునని తాత్పర్యము.

మ॥ యతచిత్తమరుద్ధశేంద్రియ తనువ్యాపారుడై హానినై।
హతకామాదివికారుడై గత భయుండై బ్రహ్మచారివ్రత।
స్థితుడై శాంతమనస్కుడై స్వగురుమూర్తిప్రోక్తలక్ష్యార్థసం।
గతియామధ్వయమభ్యసింపదగు యోగంబుంచితోద్యోగుడై॥

తా॥ ఓ ఆంజనేయా? మనోబుద్ధిచిత్తహంకారములను జ్ఞానేంద్రియ కర్మేంద్రియములనుజయించి, ప్రాణాదిపంచవాయువులను వశముచేసికొని, శరీరవికారమునణచి, మౌనవ్రతముగలిగి, కామ క్రోధ లోభ మోహ మద మత్సరముల దుర్గుణముల నశింపజేసి, ఆధ్యాత్మిక ఆదిభౌతిక ఆదిదైవిక తాపములవలని భీతిలేక గురు శుశ్రూషా భిక్షాభోజనాది బ్రహ్మచర్యాశ్రమ లక్షణములుగలిగి మనస్సును నెమ్మది పరచుకొని, తన దేశికునిచేత ఉపదేశింపబడిన అంతర్లక్ష్యమందునిలిచి, అందుతోచిన పరమకళ యందు శుద్ధ సత్వవృత్తిగల తనమనస్సునుచేర్చి, రెండుజాములు నిష్ఠ సలుపవలయునని తాత్పర్యము.

కం॥ మారుతియీనియమంబులు*తారకసాంఖ్యామనస్క*తత్వములకునా*
ధారణములగును వెలయున్*తారకయోగులకతి*ప్రధానములందున్॥

తా॥ ఓ హనుమంతుడా? జ్ఞానేంద్రియ కర్మేంద్రియ అంతరింద్రియములను, ప్రాణాది పంచవాయువులను, స్థూల సూక్ష్మ కారణ శరీరములను, కామ క్రోధాది దుర్గుణములను గెలుచుట మొదలైన నియమములు, తారకయోగ సాంఖ్యయోగ అమనస్కయోగులకు ముగ్గురికిని ముఖ్యముగ గలిగియుండవలయును. అందు తారకయోగులు అభ్యాసులుగనుక వారికి ఇంద్రియజయాది నియమములు మిక్కిలిఆవశ్యకములని తాత్పర్యము.

* కందార్థము *

౨౭* గురువరపరిపూర్ణంబన * నెరుకననవి రెండుయట్టి* వెరుకోద్భవమెం* దెరుకజ నచోటుయెయ్యది* యెరుకనునే నెట్లువిడచే * దెరిగించుమ నెనూ * అట్ల నెగురు డెరిగింతున నెనూ* చరణాధూళిని రెండుకరములగొనితన* శిరమూనధరియించిశరణాని యాశిష్య డెరిగించుమ నెనూ* అట్ల నెగురు డెరిగింతున నెనూ॥

కం॥ పరమపురుషుడన నెవ్వడో* యెరు కెట్టిదో తెల్పియువల* యెరుకనువిడిచే* తెరువెట్టిదోయిన్నియునా* కెరిగించుమటంచుబల్కె* నిట్ల నెగురుడున్ ॥౨౮॥



కం॥ వినినన్ గురునిమహాత్మ్యమె* వినవలెకన్గొనినగురుని* విగ్రహమేక* న్గొనవలె మేనధరించిన* తనగురుపదధూళిమేన* ధరియింపదగున్॥

* శ్రీ శి వ రా మ దీ క్షి తీ య మ సు బ్ర హ ద్వా శి ష్ఠం *
( అ చ ల బో ధ శి ద్ధాం త ం )

**గురువు**॥ అందుకే మొట్ట మొదలుబట్టబైలువున్నా దా లేదా। అని అడుగవలె। ఘట్టిగావున్నాది అనెనా। అప్పుడే భ్రాంతి లేనివాడు। అవుచాడు। అవుచాడుగాని। యీశరీరానకు మూలంయేమైనావున్నా దా లేదా। అనిఅడిగి। శీఘ్రింగా తెలుసుకోవలె। తెలుసుకుంటె। మూలంవున్నదనేనా। కల్తాసాంప్రదాయం అని గ్రహించేది। లేదుఅనెనా దృష్టాంతపూర్వకంగా సమాధానంచెప్పండి। అనేది। అంటె। యిది యంత। కలకూ। మూలంయేమీలేదు। కలలో వచ్చి యంతప్రతాపంచూపినా నిబద్ధిఅని। నమ్మరాదు। వెంటనేమేలుకొంటే। వారికి మనము యేమీ లేదు। మనకువారు యేమీలేదు। తనకుతానే స్వతస్సిద్ధమైవున్న। బట్టబయలుయీలాగువున్నది। ఆలాగేవున్నది। దానికి। రాకడా లేదుపోకడా లేదు। వునికీలేదు। యేమీ లేకపోవుటం లేదు। సార్వకాలంవక్కతీరె। యిషువంటి। యేమీలేనిదానికి। యేమిసాధించినా। యేమీలేదు। పుట్టనిచావనిది। మొదలుకొనాలేనిది। రాకడా

పోకడాలేనిది । సార్వకాలంశరీరం లేనిది। క్రియాశూన్యమైనది।తనకుతానే స్వతః శిద్ధమైవుంన్నది । యన్నటికిచలించనిది ।సకలదేశాలయందు।సార్వకాలాలయందు। సమస్తమైన వస్తువులయందు । జ్ఞానకర్మాలుఅనేవిలేక । కర్మాలకుకారణమనేజ్ఞానం । శూన్యమై। జగత్తువున్నది । లేనిదియెరుగక । " నిత్యః। సర్వగతః । స్థాణుః। అచలోయం। సనాతనః" । అయింది । యీబట్టబైలేకాని। మరిహాటికాదు। " మూలంలేని యీగుర్తెరిగేశరీరం యేమీలేదు " అని దృఢంవుంటేసార్వకాలం వాక్కతీర । పరిపూర్ణంతనకుతానే । స్వతఃశిద్ధమైవున్నది ।ప్రయత్నంలేదు।గనక । ప్రయత్నంయేది చాయబోతుందో। అదేఏమీలేదు ।అందుకే। "మూలంలేనియీగుర్తెరిగేశరీరం యేమీలేదు" । అనిచెప్పపాటులో । సఘంకాలమైనామరువక । వుండవలె । వుండకపాయనా। అందరికీ వట్టి భ్రాంతికుడే। అవుచాడు । యీరుచి। అభ్యాసదార్ఢ్యం । వున్నాకొద్ది । అనాయాసం ।మూలంలేనియీగుర్తెరిగేశరీరం । ఆవరణంవలెవున్నది।గురువాక్యంచాతసకలభ్రాంతిరహితం అవుచుంది ।యీశరీరంవుంచుకొనెనా। వకటైనాభ్రాంతి పోదు। మూలంలేని యీగుర్తెరిగే శరీరంచాత।సాధింతామని సాధనచేశెనా యన్నటికీసాధ్యంకాదు। యీబట్టబైలు తప్పవిడచి రెండోదివేమీలేదు । యేమీలేనిది।మూలంలేనియీగుర్తెరిగేశరీరమే ।మొదలువేమీలేదు ।కొనకుయేమీలేదు ।వున్నప్పుడు ।గురువాక్యంచాత। "మూలంలేనియీగుర్తెరిగేశరీరంయేమీలేదు " । అనికనుక్కునెనా। వాడుధన్యుడు। వున్నప్పుడు కనుక్కోకపాయనా। అన్నిటివంటివాడే। శరీరంలేనిగురుసాంప్రదాయం । అరుదు।దాంన్నంచేకాని। సకలభ్రాంతిరహితంకాదు। కర్మాలకుమూలం। మూలంలేనియీగుర్తెరిగేశరీరమేకాని। మరిహాటిమూలంకాదు । యీశరీరంలో కొంత మంచిదిఅని। ఆశపడ్డా అదేవిషం। కలలోవచ్చినయేనుగయొక్క దంతాలకు। ఆశపడితె ।మేలుకొంటె।యేమీలేదు। కలలోవచ్చినశరీరరం। కొంతవుండి। కొంతపోయిందే మేలుకొంటెయేమీలేదు। ఆలాగే। " మూలంలేని యీగుర్తెగేశరీరం యేమీలేదు " అని। గురువాక్యంచాత। మేలుకొంటే। యప్పటి బట్టబైలే.

*ఇతి శ్రీమద్గురుశివరామ దీక్షితప్రభావే వేదాంత విచారణే*
(భ్రాంతిరహిత ప్రకరణము)

* జ్ఞా న ర హ స్య ము. *

వ॥ శ్రీమత్పరాచార్యుండైన రామానుజయోగీంద్రుదలంచి నమస్కరించి తచ్ఛిష్యుండైన వెంకటరామయోగి చరణంబులు నేత్రంబులనద్దుకొని తత్ప్రియశిష్యుండైన నారాయణగురుమూర్తి పాదారవిందయుగళ మకరందంబు భ్రమరాయమానుండై గ్రోలి తత్పాదతీర్థ ప్రసాదంబులు భుజియించి బ్రహ్మానందరామాంకితంబువారల ప్రసాదంబుగైకొని తదియోపదేశంబునుల అద్వైతమార్గంబు కర్మజ్ఞులకు మూఢజనులకు దెలియుకొరకు జ్ఞానరహస్యంబను గ్రంథంబు నిర్మింపగలవాడనై హరిహరాదులును బ్రాహ్మణ వైష్ణవ శ్రేష్ఠులును సకల కుకవి సుకవిజనంబులును సిద్ధులును సమస్తయోగధారణులును ద్వైతాద్వైతులును విసిష్టాద్వైతులును సకలలోకంబుల నెల్లజనులును యెణ్బైనాల్గు లక్షల జీవరాసులును ఏతత్సర్వంబు బ్రహ్మమయంబు గావున నన్నిటిని గూర్చిరచించెద బుధోత్తములు వినుండి మొదలుపూర్ణ బ్రహ్మంబునందవ్యక్తంబు బుట్టె అవ్యక్తంబున మహత్తును మహత్తున నహంకారంబును అహంకారంబున రాజస తామస సాత్వికంబులనియెడు త్రిగుణంబులు జనియించె నా త్రిగుణంబులవలన జ్ఞానశక్తి క్రియాశక్తి ద్రవ్యశక్తి యనియెడి త్రిశక్తులు సంభవించిన త్రిశక్తులవలన శబ్ద స్పర్శ రూప రసగంధంబులనియెడి పంచతన్మాత్రలు బుట్టె నట్టి శబ్దంబువలన నాకాశంబును స్పర్శంబువలన వాయువు రూపంబువలన తేజస్సు రసంబువలన జలంబును గంధంబువలన భూమియు ననియెడి పంచమహాభూతంబులు జనియించె నామహా పంచభూతంబులవలన అతల వితల సుతల మహాతల రసాతల తలాతల పాతాళంబులనియెడి యధోలోకంబులును భూలోక భువర్లోక సువర్లోక మహర్లోక జనలోక తపోలోక సత్యలోకంబులును నదులు నిధులు శిలలు పర్వతంబులు వృక్షంబులు సకలచరాచరంబులు జంతుజాలంబులు మొదలగు యీ సమస్తంబులునయ్యె నట్లు గావున నింతయుకూడి బ్రహ్మాండంబనంబరగె. నింక పిండాండోత్పత్తి వివరించెద. మొదలవిద్యలో ప్రతిఫలించినజీవుండు సూర్యకిరణంబులసూర్యుండు సముద్రోదకములు గ్రహింప నందువశించి మేఘంబులనుండి వర్షంబుల

నుండిభూమినిజారి తొల్లి ఫలియించిన సస్యంబులం జెంది వృక్షంబుల ఫలియించిన ధాన్యంబులం జేరి స్త్రీపురుషుల కన్నరూపంబుగా భక్షింప నన్నంబు బిందువగు నట్టిబిందువు స్త్రీలకు రక్తరూపంబుగా పురుషులకు శుక్లరూపంబునై యోని శిశ్న సంపర్కంబువలన స్త్రీగర్భంబున మల మధ్యంబునంబడి రక్త శుక్లంబు లేకీభవించి యేడురాత్రంబులకుబుద్బుదాకారంబై కొన్నదినంబులకుఅండంబై అమీద పిండంబై ఐనుమాసంబుల పదిహేనుదినంబులకు మనుష్యాకారంబై కరచరణాద్యవయవంబులుగలిగి తీసికవిష్ణించు రంధ్రంబున వెలిగతి భగ ద్వారంబు వెడలినప్పుడు నట్లు దిన పక్ష మాస క్రమంబున స్థూలశరీరంబనంబడు నట్టి స్థూల శరీరంబునకు వాక్పాణి పాద పాయూపస్థలనియెడి కర్మేంద్రియంబులును ప్రాణాపాన వ్యానోదాన సమానంబులనియెడి పంచ వాయువులును శ్రోత్ర త్వక్చక్షు జిహ్వాఘ్రాణంబులనియెడి జ్ఞానేంద్రియంబులును శబ్ద స్పర్శ రూప రస గంధంబులనియెడి విషయంబులును అంతఃకరణ మనో బుద్ధి చిత్తాహంకారంబులనియెడి అంతఃకరణ పంచకంబును యీపంచవింశతి తత్వంబుల స్థూలశరీరంబయ్యె. వాక్పాణి పాదపాయూపస్థలును త్వక్చక్షు శ్రోత్ర జిహ్వ ఘ్రాణంబులును ప్రాణాపానవ్యానోదాన సమానంబులును మనోబుద్ధులుగూడి పదిహేడుతత్వంబుల సూక్ష్మశరీరంబయ్యె. కారణ శరీరంబు యిట్టి స్థూల సూక్ష్మ కారణంబుల యేకజీవంబు మూడు విధంబులనుండు నది యెట్లనిన స్థూలశరీరంబున విశ్వుండనునామంబున కన్నుల వశియించి జాగ్రత్తుభోగించు నట్టిజాగ్రత్తువదలిన తైజసుండను నామంబున సూక్ష్మశరీరంబున కంఠంబునవశియించి స్వప్నంబనుభవించు సూక్ష్మంబువదలిన కారణంబున హృదయంబున ప్రాజ్ఞుండనియెడి జీవుండు వశియించి సుషుప్తియనుభవించు నట్టిస్థూలంబు అన్నమయకోశంబు సూక్ష్మంబు ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ కోశంబులు కారణంబు ఆనందమయకోశంబు యీమూడు శరీరంబులగల లక్షణంబులు జెప్పెద ఆధ్యాత్మిక ఆదిభౌతిక ఆదిదైవికంబులనియెడి తాపత్రయంబులును ఆగామి సంచిత ప్రారబ్ధంబులనియెడి కర్మత్రయంబును క్షుత్పిపాస శోక మోహ జన్మమరణంబులనియెడి షడూర్ములును దారేషణ ధనేషణ పుత్రేషణంబులను

ఈషణత్రయంబును దయా లజ్జా భయ శంకాదులైన అష్ట పాశంబులును కామ క్రోధాద్యరిషడ్వర్గంబును విపరీతజ్ఞానంబును అన్యథాజ్ఞానంబును అసంభావనాజ్ఞానంబు ననియెడి జ్ఞానత్రయంబును కులంబును బలంబును గోత్రంబును ధనంబును యవ్వనంబును రాజ్యంబును విద్యా తపంబులనియెడు అష్టమదంబులును మొదలుగాగల గుణంబులతో నుండు నట్టిస్థూల శరీరంబన్నింటికి నాధారంబు అట్టి స్థూలశరీరంబు మహాత్తువివరించెద రోమంబులు త్వక్కు మాంసంబును రక్తంబు రజ్జులు బొక్కలు పూసలు ననియెడు సప్తావరణ వేష్టితంబునగు నదియునుంగాక భూమి తత్వంబులగు త్వక్కు మాంసంబును రోమంబులు నరంబులు నస్థులు వుదకతత్వంబులగు మూత్రంబు రక్తంబు శుక్లంబు తెమడయును చొల్లును తేజోతత్వంబులగు క్షుధా పిపాస నిద్రా అలస్య సంగమంబులును వాయుతత్వంబులగు చలన ఆందోళన కంపన ఆకుంచన శోషణంబులును ఆకాశతత్వంబులగు భయ లజ్జ లోభ క్రోధ కార్పణ్యంబులును నీపంచవింశతి తత్వంబుల వెలుంగు నదియునుంగాక గుదంబున నాధారంబును శిశ్నంబున స్వాధిష్ఠానంబును నాభిని మణిపూరకంబును హృదయంబున అనాహతంబును కంఠంబున విశుద్ధంబును నుదుట నాగ్నేయంబును యివ్విధంబున షట్చక్రంబులుండు, ఆజ్ఞేయంబునకు రెండు రేకులు విశుద్ధంబునకు పదహారు రేకులు అనాహతంబునకు పన్నెండు రేకులు మణిపూరంబునకు పది రేకులు స్వాధిష్ఠానంబునకు ఆరు రేకులు ఆధారంబునకు నాల్గు రేకులుగల్గు, నందు ఆధారంబు బంగారపు పుష్పఛాయ స్వాధిష్ఠానంబు తెలుపు మణిపూరకంబు యెరుపు అనాహతంబు పచ్చనివర్ణంబు విశుద్ధంబు నలుపు ఆజ్ఞేయంబు మాణిక్యవర్ణంబు నందు ఆగ్నేయంబునకు హం, క్షం, విశుద్ధంబునకు అ, ఆది పదహారు వర్ణంబులు అనాహతంబునకు కకారాది ఠకారాంతంబగు పన్నెండక్షరంబులు మణిపూరకంబునకు డకారాది ఫకారాంతంబైన పది యక్షరములు స్వాధిష్ఠానంబునకు బకారాది లకారాంతంబైన అక్షరములును ఆధారంబునకు వకారాది సకారాంతంబైన నాలుగక్షరంబులును అందు ఆధారంబునకు గణపతి స్వాధిష్ఠానంబునకు బ్రహ్మ మణిపూరకంబున కువిష్ణు అనాహతంబునకు రుద్రుండు విశుద్ధంబునకు

ఈశ్వరుండు ఆజ్ఞేయంబునకు గురుండు అధిదేవతలై యుందురు యీషట్చక్రంబులమీదట సహస్రారచక్రంబు కోటిసూర్యప్రకాశంబుగలిగి వెలుంగు అందు వెలుగు లోపటివెలుగు మొదటివెలుంగు నదియు నిర్వికల్పంబును నిత్యంబును శాంతంబును నిరాకారంబును నిష్ప్రపంచంబును నిత్యశుద్ధంబును నిరాభాసంబును నిరాధారంబును నిస్తేజంబును నిస్తమసమును సర్వపరిపూర్ణంబైన బ్రహ్మంబుమీదై యవతరించిన బ్రహ్మంబు నిశ్శబ్దంబు బ్రహ్మంబు అదియె ఓంకారంబు ఆఓంకారంబునకు నాదబిందు కళలు మూడుజన్మించె నాదంబునకు అకారంబు బిందువునకు ఉకారంబు కళకు మకారంబును సంభవించె అకారంబునకు రాజసంబు ఉకారంబునకు సాత్వికంబు మకారంబునకు తామసంబు ఉద్భవించె రాజసంబున జ్ఞానశక్తి సాత్వికంబున క్రియాశక్తి తామసంబున ద్రవ్యశక్తియు బుట్టె జ్ఞానశక్తిని బ్రహ్మజనియించి సత్యలోకనివాసుడయ్యె క్రియాశక్తిని విష్ణుసంభవించి వైకుంఠ నివాసుడయ్యె ద్రవ్య శక్తిని రుద్రుడుద్భవించి కైలాస నివాసుడయ్యె నట్లు ముగ్గురు జనియించి ఉత్పత్తి స్థితి లయ కర్తలైరి బ్రహ్మవలన విశ్వుండు జనియించె విష్ణువలన తైజసుండు జనియించె రుద్రునివలన ప్రాజ్ఞుండుబుట్టె ఆవిశ్వుండు స్థూలరక్షకుండై నేత్రంబులవశియించి జాగ్రత్తుభోగించు తైజసుండు లింగశరీర పోషకుండై కంఠంబున వశియించి స్వప్నంబనుభవించు ప్రాజ్ఞుండు కారణశరీర రక్షకుండై హృదయంబుననుండి సుషుప్తిబొందియుండు ఆజాగ్రత్స్వప్న సుషుప్తులను సత్తు చిత్తు ఆనందంబులు సంభవించె నదియు సచ్చిదానందంబు తత్వజ్ఞులకు దివ్యమంత్రంబు స్థూలశరీర స్థితి వివరించెద. సకలేంద్రియంబుల సకలదేవతులు వశియించిరి, అదియెట్లనిన వాక్కున సరస్వతియు హస్తంబుల దేవేంద్రుడును పాదంబున ఉపేంద్రుండును గుదంబున యముండును ఉపస్థయందు బ్రహ్మయు త్వక్కున వ్యాసుండును కన్నుల సూర్యుండును శ్రోత్రంబుల దిక్కులును జిహ్వయందు వరుణుండును నాసికంబున నశ్వినీదేవతలును మనంబున చంద్రుండును బుద్ధిని బ్రహ్మదేవుండును చిత్తంబున మాధవుండును అహంకారంబున రుద్రుండును జ్ఞానంబున గురుండును వశియించి తమతమ సంచారంబులకొలది సర్వేంద్రియంబుల ప్రవ

తెలిపెదరు. నదియునుంగాక పాదంబుల అతలంబును జానువుల వితలంబును జంఘల సుతలంబును వూరువుల రసాతలంబును గుహ్యంబున తలాతలంబును కటిస్థానంబున మహాతలంబును నాభ్యధోభాగంబున పాతాళంబును నాభిని భూలోకంబును జఠరంబున భువర్లోకంబును హృదయంబున స్వర్లోకంబును కంఠంబున మహర్లోకంబును ముఖంబున జనలోకంబును భ్రూమధ్యంబున తపోలోకంబును శిరంబున సత్యలోకంబును మొదలగు చతుర్దశ లోకంబులు తనయందే యుండును నదియునుంగాక. శిరంబున శ్రీశైలంబును ఫాలంబున కాశీ క్షేత్రంబును చిత్తంబున జగన్నాథంబును నాభీదేశంబున రామేశ్వరంబును జ్ఞానాజ్ఞానంబులకు ప్రధానంబగు జ్ఞానంబున నన్నియుందోచు నజ్ఞానంబున జడత్వంబునగు యీశరీరంబున మూడుకోట్ల యఱువదిలక్షల రోమకూపంబులును డెబ్బదిరెండువేల నాళంబులును యిడా పింగళా సుషుమ్నా నాడులును కుండలియును షట్చక్రంబులును బ్రహ్మాదండియును అష్టదిక్పాలకుల పురంబును సముద్రంబులును నదులును నిధులును పుణ్యక్షేత్రంబులును నిన్నియుచూచిన నన్నియును నీశరీరంబున గనుపించు సమస్తదేవతలున్ను సర్వతీర్థములున్ను సర్వలోకంబులును నింతనంత యనిన్నిలో యీబ్రహ్మాండంబు సమస్తంబు యీశరీరంబాశ్రయించి యున్నది అదిగావున ఆచార్య కటాక్షంబున మహావాక్యోపదేశమున జ్ఞానంబుదోచు అందువలన నన్నియు నిశ్చయంబుగాదోచు ఆచార్యోపదేశంబు లేనివారికి యేమియుందోచదు నిన్నియు దివ్య జ్ఞానోపదేశంబున జ్ఞాననేత్రంబొసంగిన ఆచార్య శుశ్రూషవలన యీ చెప్పినవన్నియు సిద్ధించు.

ఇతి శ్రీజ్ఞానరహస్యం

శ్లో॥ ఆశార్థందియ్యతేదీక్షా। డంబార్థంపూజయేచ్ఛివం।
వాదార్థంపఠతేవిద్యా। ముక్తిర్నాస్తివరాననే॥

శ్లో॥ ధర్మార్థందియ్యతేదీక్షా। మోక్షార్థంపూజయేచ్ఛివం।
జ్ఞానార్థంపఠతేవిద్యా। ముక్తిఃస్సిద్ధివరాననే॥

* కందార్థము *

(౨౯) * మొదలచలము నెరిగించెద * విదితముగా లేనియొనక * వివరింతుపయిన్ * తుదకెరుకనువిడిపించెద * మదిలోనామాటనమ్మి * మరివింటివేని * చంచలబుద్ధి * మానుంటివేని * పదుగూరుసనుజూ చిభళిశాబస్సీశ్రీవ * కెదురూలేద నెట్టు * యిదుగో నేజేశేద * మరివింటివేని * చంచలబుద్ధిమానుంటివేని * * * * * *

కం॥ కదలడటపరమపురుషుడు * కదలికమాయయటంట్రి * కదలికకేదో *
మొదలన పెద్దలుబల్కిరి * కదలనిదేకలను లేదు * కదలికయనుచున్ ॥ ౩౦ ॥

—( శ్రీ శి వ రా మ దీ క్షి తీ య ము ను బృ హ ద్వా శి ష్టం )—

( అ చ ల బో ధ శి ద్ధాం తం )

గు॥ యేశిద్ధాంతంనమ్మినా। మూలంలేని యీగుర్తెరిగే శరీరంలేని రాజమార్గం లేదు మూలంలేని యీగుర్తెరిగే శరీరంను నిల్పి। యేమిచెప్పినా మనుషటిగాడిదివాలకంపోదు। అందుకే। మొట్టమొదలు బట్టబైలు వున్నదిగదాయని। సత్యాసూరు మాట్లు పదిదినాలు చెప్పవలె। ఘట్టిగా వున్నదిఅని। పదకొండోనాడు అనేనా। వీడు। ఘుట్టివాడేఅనివాణ్ణిదగ్గరవుండుమనవలె। వుండి। శేవవంచనలేక చేశెనా। భ్రాంతిలేనిరాజమార్గం। సూచన చాయవలె। మొద్దుఆయెనా। వేగిరం సూచనచెయ్యకూడదు। చేస్తే వ్యర్థమవుచుంది। వెయ్యిమార్లు వుపదేశంచెప్పి వుంచవలె। శరీరంలో కొంచెంనిబద్ధిఅనిచెప్పెనా। ఆగురువు, పుత్రమిత్రకళత్రాదులతోటి। నిమ్నాలనై వంశక్షయమై పోతాడు। అని భరద్వాజులు పల్కినాను యేమీ అని. అంటే। శృతి॥ "సమూలో హావాఉపరిశిష్యతి। యేనృతమభివదిశతస్మాత్ హామ్యనృతంవక్తుం"...అని ప్రశ్నోపనిషత్తుయందు। వున్నది। అందుకే। ఛీఅని। యెవ్వరికీ అబద్ధాలు చెప్పకూడదు అధికారి అయితే నిబద్ధిసూచన చేశేది। మూలంలేని యీగుర్తెరిగేశరీరానకు। సార్వకాలంయీజగత్తుతోచేస్వభావం। తనకుతానేకల్పించింది। అందులో యెంతమంది। సన్యాసులుతోచినారు। యెంతమందిఅనేకమైనవారుతోచినారు। వారు గుర్తెరిగేచైతన్యస్వరూపులా। మరిహో। స్వరూపులా?

శి॥ అందరూగుర్తెరిగేవాకే। వారూ యీశరీరం సమానమే।

గు॥ యెరుకతోవుండగానే। వారుయెక్కడపోయిరి.

శి॥ యెక్కడనుంచివచ్చినారు। గనక। యెక్కడికిపోయిరి। అనిచెప్పాను।

గు॥ తనకుతానేతోచింది। వెంటనే యేమీలేదు।తనకుతానే స్వతశిద్ధమైవున్న। బట్టబైలులోతనకుతాను। వచ్చినశరీరం। శరీరమేనేను। అని। అనుకుంచూవున్నది మూలంలేని యీగుర్తెరిగే శరీరంవుండగా। అనేకశరీరాలు తోస్తూవున్నవి। కలలోవచ్చిన శరీరాలవలెనే। "మూలంలేని యీగుర్తెరిగేశరీరం యేమీలేదు" అని మేలుకొంటె। యెవ్వరికి తోస్తావి.

శి॥ యీగుర్తెరిగే శరీరంయేమీలేకుంటె। యేమీతోచదు।
కలలోవచ్చినశరీరాలు మేలుకొంటే యేమీలేదు। అని తనకుతానే దృఢంవున్నది। యేమీసాధన చేయందే।తనకుతానే। మూలంలేని యీగుర్తెరిగే శరీరం యేమీలేదు। అనిసరిపుచ్చుకోవలె.

గు॥ యేమీ। యెన్నడైనా। "కలతోచిన దేహాలు యీలాగుయేమీలేదో"। అలాగే "మూలంలేనియీగుర్తెరిగే శరీరంయేమీలేదు" అనిసరిపుచ్చుకున్నావు।

శి॥ సరిపుచ్చుకోలేదు। యెప్పుడైనామంది। యీగుర్తెరిగేశరీరం।కలతోచినశరీరం మేలుకొంటే। యేలాగు యేమీ లేదో। అలాగే। యేమీలేదు। అనిఅనుకున్నా। నాకుస్మారకంవొచ్చి। యెవ్వరుఅనుకోరయ్యా। వారికే కలవంటిది యీ సంసారం అనుకొంటారు। అప్పటిది। అప్పుడేపాయె। యీ సరిపుచ్చుకుంటె। వున్నదానికి శరీరంలేదుగనక। దానికితోచనేలేదు.

గు॥ అందుకే। మూలంలేనియీగుర్తెగేశరీరంకు। తోచినశరీరాలు। వెంటనేయేమీలేదు। అనిదృఢంవున్నట్టు। వుంటేచాలు.

శి॥ యిందుకు యేమైనా సాధనచెయ్యవలె.

గు॥ యేసాధనచేస్తే కలతోచినశరీరాలు। యేమీలేదు। అని దృఢంఅయింది.

శి॥ యేమీలేదు। తనకుతానేదృఢంవున్నది। యిక్కడ దృఢంతోగూడా యేమీ లేదు। ఆలాగే కలతోచిన దేహాలకు దృఢంవున్నదే.

గు॥ మళ్లామళ్లా యేమీలేదు। అనుకొంచూవున్నావే।

శి॥ వున్నంత శేపూ వున్నట్టు వున్నావి। వెంటనే యేమీలేదు.

గు॥ ఆలాగే। గురుమూలంగా। యిప్పుడు మేలుకొంటె అప్పుడేకొంచమైనా శరీరం లేక। కలత్రోచిన దేహాలవలె। వెంటనే। యీగుర్తెరిగే శరీరం। యేమీలేదు। ఈపత్తుఅశపడ్డా అంతావుంచ్చుంది। యిదిరాజమార్గం। కలత్రోచిన దేహాలు। యీదేహాలు చుట్టాలు।వీరికీ వారికీ। మహాస్నేహం। నిత్యామీరు లెస్సవున్నారుగదా అని అన్యోన్య యేకాంతాలుకద్దు। మీకు యేమీవిపత్తు లేదుగదా। అని కలత్రోచినవారు। అడిగితే,। మీకుమీరేదిక్కు। మాకు మేమేదిక్కు। అని వీరూవారూసమాధానంచేసుకుంటారు। సరేకాని। మనము చేశిన పుస్తకాలు। చూస్తారుగదా.

శి॥ చూస్తారుగాని। మనలోనే పోటీలువున్నావి.

గు॥ అదేమి.

శి॥ వీరూవారూసమానమేఅని। గులగులపుట్టింది.

గు॥ యిఘుయాలాగుఅంన్నా.

శి॥ మనకుమూలం యేమీలేదు। కొనకుప్రవేశించేటందుకు। స్తానం యేమీ లేదు అని ।పుట్టింది.

గు॥ అతాయీకలత్రోచినదేహాలు। వెంటనే యేమీలేదు। గదా.

శి॥ ఆలాగే"మూలంలేనియీగుర్తెరిగే శరీరం యేమీలేదు" అని కొందరు కనుక్కుంటూవున్నారు.

గు॥ యేమీ। యేమీ। అయితేమునిగే। వెళ్లివచ్చినట్టే వుండేను। యీలాగువున్నది। యేసంతోషంలేదు। యింతమర్మం యెవ్వరు చెప్పిరి.

శి॥ మనలోనే స్వామిద్రోహులువున్నారు.

గు॥ అయితే। దేవతాభ్రాంతి అయినాలేదు। వీరూ యేమీలేకుంటే। మీకు యేమి। భ్రాంతివున్నది। ఆలాగే। "మూలంలేనియీ గుర్తెరిగేశరీరం యేమీ లేదు"। అని సరిపుచ్చుకుంటె యేభ్రాంతికిమూలం యేమివున్నది। అయితేమన పని కూకుడు వేళ్లకువ్వాడిపోయె। యిప్పటికీఅలాగేవుంన్నది। ఔ।యెంత్తఅయినా। యీశరీరం లోగ్రహించెనా।కదలక। మనమంత్తావుందుము। దరువాజాత

గాలు బెడితె యేక బాటఆయె । యిదియెవ్వరితరం । మొదలుకొనాలేని యీబొట్ట బైలు నెయ్యమాట్లు ప్రుపదేశం చెప్పి । కలతోచిన శరీరాలు । వెంటనే । యేలాగు యేమీలేదో । ఆలాగే ।"మూలంలేని యీగుర్రెరిగేశరీరం యేమీలేదు"। అనితాత్పర్యంఆయితే । యప్పటిపరిపూర్ణం । తనకుతానే స్వతఃసిద్ధమైవున్నది। మనకుచోటుయేది । మొదలశక్యం కాకుండాఆయె । యింతమీదట । వుపద్రవమే నాకు చాడీలు చెప్పినట్టురాను । వెంటనే యేమీలేదు.

శి॥ మిమ్ములచూచేవాండ్లు । మీజాడకనుక్కొనిరి । మీకుఅజాగ్రతచాతవుండగాదు।మీకూయేమిదిక్కు । నాకుయేమి దిక్కు । వెనక యేమీ।లేదు । ముందర యేమీలేదు । మగడులేని ముత్తైదువతనం । యెంతకనిఆపతరం।కాని । యేలాగైతే । ఆలాగు । మనస్వభావమే ।

గు॥ యేమీలేదు।మనముదేనియందువున్నామో । అదేలేకపోయెగదా.

శి॥ అందరికీ । అదేఆశ।

గు॥ యేమీలేనిది । యేమీలేదు । వున్నది రాదు।పోదుగదా ।

శి॥ సార్వకాలం వాక్కుతీరే । దీన్ని యెంతనమ్మినా యేమీలేదు ।

గు॥ శీఘ్రంగా యీబట్టబైలు వున్నదనినమ్మి "మూలంలేని యీగుర్రెరిగేశరీరం యేమిలేదు" । అనితాత్పర్యం చేసుకోవలెను । యీగుర్రెరిగే శరీరంచాత ।లేపలేదు అనిఅంటే । యీశరీరమే వుంచుంది । కలతోచినశరీరం కొంతవున్నాదే?

శి॥ యేమీలేదు ।

గు॥ ఆశరీరాలు యేమైనా అనుకొంటూ వున్నావి.

శి॥ యేమీలేదు.

గు॥ యేమి అనుకుంటావి । ఆలాగు । యీగుర్రెరిగే శరీరాన్ని । తాత్పర్యం చేసుకుంటే । పరిపూర్ణం తనకుతానే । చలించక స్వతఃసిద్ధమై । వున్నది । విచారం చాతనేకాని । సాధనచాత సాధ్యంకాదు । శ్రమమాత్రమే.

శి॥ అయితే యెందుకు శ్రమపడ?

గు॥ పుట్టనిచావనిబట్టబైలు । తనకుతానే । స్వతశిద్ధమైచలించకవున్నదిగదా.

శి॥ యీబట్టబయలు శాశ్వితంగావుండనేవున్నది.

గు॥ యిఘమేమీఅంటే। మూలంలేనియీగుర్తైరిగేదేహం। ఆగాంతకం। కలత్రోచినట్టు యీ దేహం త్రోస్తూవున్నది।యిందుకు యుక్తి“కలత్రోచినదేహాలు వెంటనే యేమీ లేదు”। అని తనకుతానుయీలాగు। దృష్టమో ఆలాగే।“ మూలంలేని యీగుర్తైరిగేశరీరం యేమీలేదు” అనితాత్పర్యం అయితేసరి। యీ రెండుదేహాలు। ఆగాంతకాలే। కలత్రోచినదేహాలు। యీదేహాలువొక్కటే। రెంటికి మూలం యేమీలేదు। మధ్యవచ్చి।మధ్యపొయ్యేవాటికి। మధ్యనేత్రోచింది। మధ్యనే యేమీ లేదు। మూలంలేనియీగుర్తైరిగేశరీరంలేకుంటె।యేమీత్రో చదు సకలభ్రాంతులకుమూలం। మూలంలేనియీగుర్తైరిగేశరీరమే। శరీరంలోకొంత సత్యమనిఆశపడ్డా।అంత్తా యిప్పటివలెనేవుంచుంద్ది,

— ఇతి శ్రీమద్గురు శివరామదీక్షిత ప్రభావే వేదాంతవిచారణే, —

( భ్రాంతిరహిత ప్రకరణము. )



* భాగవతం ఏకాదశస్కంధము. *

శ్లో॥ సర్వతో మనసోసంగం। ఆదౌసంగంచసాధుషు।
దయాంమైత్రీంప్రశ్రయంచ। భూతేష్వద్ధాయథోచితం॥

శ్లో॥ మనోవాక్కాయదండంచ। సత్యంశమదమావపి।
బాహ్యాభ్యంతరసంశుద్ధి। స్థిరతాసత్క్రియాదిషు॥

శ్లో॥ మత్తోన్యమృత్యువ్యాళభీతఃపలాయన్।
లోకాన్ సర్వాన్నిభయంనాధ్యగచ్ఛతు।
త్వత్పాదాబ్జంప్రాప్యయదృచ్ఛయాద్య।
స్వస్థశ్శేతేమృత్యురస్మాదపైతి॥

* వేమన. *

గీ॥ యెరుకబ్రహ్మమనెను యిలశంకరార్యులు। తెలివిబ్రహ్మమనుచుదెలసెవ్యాసు।
లెరుక తెలుపులు రెండుయెరుగడు వేమన్న। విశ్వదాభిరామవినర వేమా॥

* సర్వోపనిషత్సార సంగ్రహము. *

శ్రీగురుదత్తాత్రేయ పరమహంసావధూతానందనాథ చరణారవింద మకరంద పానందకందళిత హృదయారవిందుండనగుచు సర్వవేదాంతార్థ సమన్వయంబుగా రచింపంబూనిన సర్వోపనిషత్సార సంగ్రహంబను వచనకావ్యంబునందు కథాప్రారంభం బెట్టిదనిన.

"ఓమిత్యేకాక్షరంబ్రహ్మ, సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ, సర్వం ఖల్విదం బ్రహ్మ, బ్రహ్మణోన్యంనకించన, యతోవాచోనివర్తంతే, అప్రాప్య మనసాసహ, ఆనందంబ్రహ్మణోవిద్వాన్, నబిభేతికుతశ్చనే,

ఇత్యాది శృత్యుక్తంబగు పరబ్రహ్మంబు మాతృ భ్రాతృ సహోదరాది వాచ్యంబున నొక్కపురుషునియందు పర్యవసానంబగుచందంబున అవాఙ్మానస గోచరంబగు పరబ్రహ్మంబనంతశబ్దవాచ్యంబై ప్రకాశించు.

మరియు ? ఓమిత్యేకాక్షరుండును, అనంత సహస్రశీర్షుండును. పురాణ పురుషోత్తముండును, పరాపర సనాతనుండును, క్షరాక్షర విలక్షణుండును, లక్ష్యాలక్ష్య రహితుండును, దృగ్దృశ్య విరహితుండును, "యతోవాచో నివర్తంతే, అప్రాప్యమనసాసహ, ఆనందంబ్రహ్మణోవిద్వాన్, నబిభేతికుతశ్చనే"

ఇత్యాది శృత్యుక్తంబగు పరబ్రహ్మంబవాఙ్మానస గోచరంబగు పరబ్రహ్మంబని వచించుచందంబున పరబ్రహ్మంబనంతశబ్దవాచ్యంబైయొప్పె నది యెట్లనిన. అవాఙ్మానసగోచరంబగు పరబ్రహ్మంబును, క్షరాక్షరవిలక్షణంబును, దృగ్దృశ్య రహితంబును, ద్వైతాద్వైత వినిర్ముక్తంబును, ఆదిమధ్యాంత సంపూర్ణంబును, అనంతంబును, అఖండంబును, అప్రమేయంబును, అవ్యయంబును, ఆది మధ్యాంతశూన్యంబును, నిరంజనంబును, నిర్వికల్పంబును, నిరాకారంబును, నిరాఖ్యాతంబును, నిత్యంబును, సత్యంబును, శుద్ధంబును, బుద్ధంబును, ముక్తంబును, పరమానంద స్వరూపంబునగు, పరబ్రహ్మంబు కేవల నిర్గుణంబనందగు తద్బ్రహ్మంబునందు అనాదియై నిత్యానుపాయినియై త్రిగుణాత్మికయై, ఆత్మశక్తియు ననిర్వచనియ్యంబై, యొప్పుచుండె. అది యెట్లంటె అనంతశాఖాపల్లవ పుష్ప ఫలాంతర్గతంబై, తత్తద్దేశ కాలాద్ధేతు

త్వంబున స్వాంతర్గత శాఖాద్యనయవాభివ్యక్తంబై ప్రకాశింపంగల వట బీజంబు ధాత్రియందనాదియై, నిత్యానుపాయినియై, ప్రకాశించు చందంబున మూలప్రకృతి సర్వభూతసుషుప్తి సమష్టిరూపంబై సత్త్వ రజస్తమోగుణాత్మికయై, సర్వప్రపంచ వాసనామయంబై, స్వాంతర్గతానంతకోటి జీవసంఘాతంబై, మోహాత్మకంబై, సకల జగదుపాదానకారణంబై, అవిద్యా వ్యక్తతమఃసుషుప్తి ప్రకృతిప్రళయ ప్రధానమాయాజ్ఞానాది శబ్దవాచ్యంబై, కేవల జడంబై, ప్రకాశింపుచుండె. మరియు, "సదేవసోమ్య దమగ్రఆసీ" ఇత్యాది శృత్యుక్తంబు చందంబున పరబ్రహ్మంబు జగద్భూత భవిష్యద్వర్తమాన కాలత్రయాబాధ్యమానంబై, ప్రకాశింపుచుండు నామూలప్రకృతి "అసద్వా ఇద మేకఏవాగ్రఆసీ" ఇత్యాది శృత్యుక్తంబు చందంబున ఘటప్రాగభావ నిత్యత్వంబుకైవడి కార్యరహితంబై, ప్రపంచాభావ నిత్యత్వంబై, అసద్వాచ్యంబై, యొప్పుచుండె. మరియు పూర్వోక్తంబగు ధాత్ర్యాశ్రయ విధేయంబైన, వటబీజంబుత త్తద్దేశకాలాద్యనుకూల్యంచేత తద్దేశకాలాదికంబునందభివ్యక్తంబై, శాఖాపల్లవపుష్పఫలాదులతో ప్రకాశించుకైవడి నామూలప్రకృతిస్వాంతర్గతానంతకోటిజీవాదృష్టసహాయపూర్వకంబై, గుణసామ్యవినిర్ముక్తంబై, గుణవైషమ్యంబననామూలప్రకృతిఅయస్కాంత సాన్నిధ్యంబువలన లోహఖండంబు చలింపంబడుకైవడి ఆపరబ్రహ్మ సాన్నిధ్యంబగుటచే "మాయాచావిద్యాచ స్వయమేవభవతి" ఇత్యాది శృత్యుక్తంబు చందంబున విశుద్ధ సత్త్వప్రధానంబుచే మాయయన మలిన సత్త్వప్రధానంబుచే అవిద్యయన ద్వివిధంబై, ప్రకాశించె. మరియు "ఆకాశతత్సర్వగతత్వమాత్మనే "ఇత్యాదిశృత్యుక్తంబుచందంబున పరబ్రహ్మంబు సర్వగతంబైన ఆకాశంబు జలాశయంబునందుండంజేసి నాజలాశయంబు జల పూరితంబగుచునుండ నాముఖ్యాకాశంబు జలావచ్ఛిన్నాకాశంబన జలప్రతిబింబాకాశంబన, జలాధిష్ఠానాకాశంబన త్రివిధంబై, ప్రకాశించు చందంబున సర్వగతంబై, స్వయంప్రకాశమానంబై, పరబ్రహ్మచైతన్యంబు విశుద్ధసత్త్వప్రధానంబగు మాయావచ్ఛిన్న చైతన్యంబగుటచే, విశుద్ధసత్త్వప్రధాన మాయావచ్ఛిన్న చైతన్యంబన, మాయాప్రతిబింబ చైతన్యంబన, మాయాధిష్ఠాన చైతన్యంబన, త్రివిధంబై, ప్రకాశింపుచుండు.

మరియు, మలిన సత్వప్రధానా విద్యావచ్ఛిన్న చైతన్యుండగుటచే మలిన సత్వప్రధానావిద్యావచ్ఛిన్న చైతన్యంబన, అవిద్యాప్రతిబింబ చైతన్యంబన, అవిద్యాధిష్ఠాన చైతన్యంబన, త్రివిధంబై, ప్రకాశింపుచుండు.

మరియు, విశుద్ధసత్వప్రధాన మాయావచ్ఛిన్న చైతన్యంబు మాయోపాధికుండగుటచే సర్వజ్ఞత్వ గుణవిశిష్టుండైన ఈశ్వరుండనందనరు. దామలినసత్వప్రధానావిద్యావచ్ఛిన్నచైతన్యంబు అవిద్యోపాధికుండగుటచే కించిజ్ఞత్వ గుణవిశిష్టుండైన జీవుండనందనరు.

మరియు, యీజీవేశ్వరులు "పణౌ ద్వౌబ్రాహ్మణిసయుజా సఖాయాస మానంవృక్షంపరిషస్వజాతేతయోరన్యః పిప్పలంస్వాద్వత్తిఅనశ్నన్నన్యోఅభిశాకశీ" ఇత్యాది శృత్యుక్తంబు చందంబున మాయావిద్యోపాధికులగుటచే-ఈశ్వరుండు అకర్మఫల భోక్తృండు వశీకృత మాయాకుండన, సర్వజీవోపాస్యమానుండై ప్రకాశించునాజీవుండు కర్మఫలభోక్తృడన, ఆవిద్యావశుడన; సర్వేశ్వరోపాసకుండై, ప్రకాశించు.

మరియునా-ఈశ్వరుండు సోపాధిస్థంబైన త్రివిధంబులగు గుణంబులలోపల సత్వతమోభిభూతంబగు రజో గుణావలంబనంబుచే, హిరణ్యగర్భరూపంబున చరాచరంబులైన సకలజగంబులు సృజియించి తద్రక్షణంబుకొరకు రజస్తమోభిభూతంబగు సత్వగుణావలంబనంబుచే విష్ణురూపంబున దుష్టనిగ్రహంబును శిష్టానుగ్రహంచే, సకల జగంబులురక్షింపుచు ప్రళయకాలంబున సత్వరజోభిభూతంబగు తమోగుణావలంబనంబుచే రుద్రరూపంబున సకల జగంబులు ప్రళయంబొనరింపుచునుండు నిట్టిసర్వేశ్వరునిచరిత్రలు వాల్మీకవ్యాసాది మహామునిప్రోక్తంబులై వేదశాస్త్ర పురాణేతిహాస యోగాగమ సమన్వయంబుగా లోకత్రయ పవిత్రంబులై ప్రకాశింపుచుండు నిట్టి సర్వేశ్వరునకు నవ్యాకృతంబు మహానందకోశంబగు సమస్తభూత సమష్టిజ్ఞానంబు కారణశరీరంబు మహాసుషుప్త్యవస్థ బ్రహ్మాది స్తంబపర్యంతంబులైన సకలభూతంబులవయవంబులు జగదుత్పత్తి స్థితి లయంబు వ్యాపారంబులు వేదశాస్త్రంబులు నిశ్వాసంబులై యొప్పుచుండు నాజీవునకు ఆనందకోశ సంజ్ఞితంబైన వ్యష్టిజ్ఞానంబు కారణశరీరంబు సుషుప్త్యవస్థయగు నారెంటియందభిమాని ప్రాజ్ఞుడ

ననోష్పుచుండు జీవాదృష్ట సహాయపూర్వక సూక్ష్మశరీరప్రకారంబెఱింగించెద నదియెట్లనిన.

మరియు, విశుద్ధసత్త్వప్రధాన మాయాసమన్వితేశ్వరుండైన సర్వేశ్వరుండు తదియ్యాదృష్ట సహాయపూర్వకంబుగా, "యిచ్ఛామాత్రం ప్రభోస్సృష్టి" ఇత్యాది శృత్యుక్తంబు చందంబున సృష్టీచ్ఛచే నిరీక్షించిన నావిశుద్ధ సత్త్వప్రధానంబగు మాయ సత్త్వ రజస్తమోభిభూతంబగు తమఃప్రధానంబయ్యె, నాతమఃప్రధాన సమష్ట్యజ్ఞానావచ్ఛిన్న చైతన్యంబువలన "తస్మాద్వా ఏతస్మాదాత్మనఆకాశస్సంభూతః" ఇత్యాది శృత్యుక్తంబు చందంబున శబ్దగుణకాకాశంబు సంభవంబయ్యె నయ్యాకాశావచ్ఛిన్న చైతన్యంబువలన స్పర్శగుణకానిలంబును, నయ్యనిలావచ్ఛిన్న చైతన్యంబువలన రూపగుణకానలంబును, నయ్యనలావచ్ఛిన్న చైతన్యంబువలన రసగుణ జలంబును, నాజలావచ్ఛిన్న చైతన్యంబువలన గంధగుణకపృధివియును, సంభవంబయ్యె. నివ్వియపంచీకృత పంచమహాభూతంబులును, పంచతన్మాత్రలనియును, జెప్పంబడు.

మరియు, తమఃప్రధానావచ్ఛిన్నంబగు పంచమహాభూతంబులు పంచీకృతంబగుటచే వ్యష్టి సమష్ట్యాత్మకంబైన స్థూలశరీరంబులుత్పన్నంబయ్యె. మరియు, సూక్ష్మభూతంబులై యపంచీకృత పంచమహాభూతంబులు రజోగుణప్రధానంబగుటచే కర్మేంద్రియపంచకంబును, ప్రాణాది పంచకంబునుత్పన్నంబయ్యె. మరియు, నీపంచీకృత పంచ మహాభూతంబులు సత్త్వగుణ ప్రధానంబగుటచే, జ్ఞానేంద్రియపంచకంబును, అంతఃకరణచతుష్టయంబును, సంభవంబయ్యె. నీకర్మేంద్రియ జ్ఞానేంద్రియ పంచప్రాణ అంతఃకరణ చతుష్టయంబగు ఏకోనవింశత్యవయవంబులుంగూడి వ్యష్టిసమష్ట్యాత్మకంబైన లింగశరీరంబయ్యె. మరియు, వ్యష్టి సమష్ట్యాత్మకంబైన, స్థూలశరీరంబునకు సూక్ష్మశరీరంబునకు కారణంబైన యవిద్య కారణశరీరంబనందగు.

మరియు, వృక్షవనంబులభంగి నొక్కటివ్యష్టియు, సర్వంబు సమష్టియును చందంబున వ్యష్టి స్థూల సూక్ష్మ కారణ దేహత్రయంబున కవస్థాత్రయంబున కభిమానియై విశ్వుండన, తైజసుండన, ప్రాజ్ఞుండన, ప్రకాశించు. నతండు జీవుండనఁదనరు. మరియు, సమష్టి స్థూల సూక్ష్మ కారణ శరీరత్రయంబు

నను జాగ్రత్స్వప్న సుషుప్తులను అవస్థాత్రయంబునకు అభిమానియై విరాట్పురుషుండన, హిరణ్యగర్భుండన, నవ్యాకృతుండన, ప్రకాశించు. నతండు ఈశ్వరుండనందురు. మరియు,నాశుద్ధ సత్వప్రధాన మాయావచ్ఛిన్న చైతన్యుండైన ఈశ్వరుండును మలినసత్వప్రధానావచ్ఛిన్న చైతన్యుడైన జీవుండును (ద్వాసుపర్ణా) ఇత్యాది శ్రుత్యుక్తంబుచందంబున కర్మఫలంబునందు భోక్తృత్వంబును కించజ్ఞత్వంబును, సర్వజ్ఞత్వంబును, ననందగి ఉపాస్యోపాసక భేదంబున ప్రవర్తింపుచుండుదురు. మరియు,నీవ్యష్టి సమష్ట్యాత్మకంబైన దేహత్రయంబునకు, జీవత్రయంబునకు, విలక్షణుండై," ద్వావిమౌపురుషౌలోకే"త్యాదిభగవద్వచనోక్తంబు చందంబున ప్రకాశించు నతండు ఉత్తమ పురుషుండనంబడగు పరమాత్ముండనందురు. మరియు,నీజీవబ్రహ్మైక్యంబు నెరింగించెద. యెట్లనిన, ఏతద్దేహత్రయ వ్యతిరిక్తంబైన అవస్థాత్రయసాక్షియైన పంచకోశవిలక్షణంబైన,బ్రహ్మంబు శ్రీగురుముఖంబునం చతుర్విధమహావాక్యానుగ్రహ పూర్వకంబుగా,తత్వమస్యాదిమహావాక్యంబునందు వాచ్యార్థంబువిడచి శుద్ధలక్ష్యార్థంబు దెలియ (బ్రహ్మవేదబ్రహ్మైవభవతి) ఇత్యాది శ్రుత్యుక్తంబు చందంబున బ్రహ్మంబేతానై, ప్రకాశించు. గాన జలబుద్బుదంబులం గడదోయ ఆకాశంబొక్కటైన తెరంగున మాయావిద్యలగడద్రోయ బ్రహ్మంబొక్కటియై వెలుంగుచుండు.

* ఏ త త్కా వ్యం బు వెం క ట రా మ యో గి వి ర చి తం బై న. *
( స ర్వో ప ని ష త్సా ర సం గ్ర హ ము. )

* కందార్థము. *

౨౭* మీరంత వారుగనుకనే * చేరితిమీపాదసేవ * సిద్ధించుటకై * యేరింతవారు జగమున * లేరనినామదికిదోచె * లెస్సగావినుడీ*ఆజ్ఞకుమీర * లేదూగనుగొనుడీ* యేరీతివినుమంటె నారీతివినియెద * మీరానతివ్వండి శ్రోరామాయీబోధ * లెస్సగ. వినుడీ *ఆజ్ఞకుమీర*లేదుగనుగొనుడీ॥ * * * *

( సద్గురుసన్నిధికింజనఁ బోంధిచుమని వేడుట. )

* తత్వము *

పల్లవి

సాధుజనవరేణ్యులార బోధజేయుడీ

అనుపల్లవి

। ధరను । యీధరిత్రిజనులనుభవబాధలణాచదగినబోధ ॥ ౧ ॥

చరణములు

౨ పాదరజమునొసట బెట్టిపట్టుమనుచుతీర్థమిడి। ప్రసాదమొసగి సాదరమునసంశ
యములతొలగ జేయు॥సా॥ * * *

౩ మూఢపునకుమూఢపునకు మనసురాదిరిగేటిమంచ్చి। యోధవీరులనుచు మనుజ
యూధమెపుడుబొగడుచుండు॥సా॥ * * * *

౪ జగముపైనబడినగాని చలనమందకునికిమీకె। తగునుమీకుదంటబెట్ట దగినధై
ర్యశాలులెవరు॥సా॥ * * * * *

౫ యీజగమునువేరుజూడ రెపుడుమీకు మీరెమహా। రాజయోగివరులు వేరె
రాజయోగులెవరుధరను॥సా॥ * * * *

౬ పరధనేతరాంగ్గనలనుపట్టిముట్టబోనియట్టి। పరమధర్మమునువరించి పరమపదము
చూరగొనిన॥సా॥ * * * * *

౭ యితర జనవిదూషణంబ్బు సతతమాత్మవినుతిలేని। వ్రతముబూని పగతునైన
సుతునిభంగినాదరించ్చు॥సా॥ * * * *

౮ క్షరాక్షరవిలక్షణమగు పరాత్పరునిమహిమదెల్పి। పరాప్రకృతులైన క్షరాక్షర
ములనువదల్చునట్టి॥సా॥ * * * *

౯. భాగవతులకృష్ణుడనటి బ్రాహ్మణుడుదలంచుశ్రీ। భద్రాగికొలనుపాక పురా
ద్యక్షుచిత్తులైనయట్టి॥సా॥ * * * *

* శ్రీ శి వ రా మ దీ క్షి తీ య మ ను బృ హ ద్వా శి ష్ఠం *

( అ చ ల బో ధ సి ద్ధాం తం )

రా॥ కలలో నేమరిచిపోయేరాజువచ్చె । వస్తానే । నానిర్ణయంనాకుతెలుసు । నాకుతెలియనిదియేమైనా వుండెనా । నాకుతీవ్రంగా సూచనచెయ్యండి । అనె ।

గు॥ పుట్టనిచావనిది । రాకడపోకడలేనిది । సార్వకాలంవొక్కతీరుగావున్నది । మొదలూ కొనాలేనిది । వున్నదిఅనె ।

రా॥ స్వామీ ? స్వామీ ? నాకుఅటువంటి । దానిజాడాయవ్వరైనా సూచనచేశెరా అని । మహాఅపేక్షచాతవున్నాను । అయ్యా । అదియెక్కడవున్నాదో । నాకుశీఘ్రంగా । సూచనచెయ్యండయ్యా ?

గు॥ చేస్తాగాని । నావర్తమానం । నాకు తెలుసునంటివి । నీవర్తమానం । కొంచెం చెప్పుమనె ।

రా॥ నాకూమూలంయేమీలేదు । కొనకూ । ప్రవేశించేటందుకు । స్థానంయేమీలేదు నాకు । నేనేవచ్చికాశేపువుండి । వెంటనేశూన్యమైపోతా ।

గు॥ శూన్యమంటే ।

రా॥ యేమీలేదు ।

గు॥ యిఘునీకుయేమికావలె ।

రా॥ యీ ప్రకారాన । పాములు । కొంగలు । కాకులు । గద్దలు । గువ్వలు । పిట్టలు । చిల్కలు । గోరెంకలు । నెమళ్లు । బాతులు । హంసలు । డేగలు । మొదలుయేమీలేనిదేవచ్చి । కాశేపువుండి । కొనకు శూన్యమాయ । నేను వాటివలెనే । అయితే । నీధర్మానా । పుట్టనిచావనిదివున్నదని । వింటిని । విన్నందుకు నాకుసూచనఅయితే మళ్లానాకు । యీదేహభ్రాంతి । పుట్టకపోయ్య ।

గు॥ కొనకూయేమీలేదని । నీకేతెలుసు । నీకేమికావలే । యీలాగుఅన్నిజంతువులకు సమానమే ।

రా॥ యిటువంటి రాజునై । అన్నిటివంటివాణ్ని కావలెనా ? స్వామీ । నాకుసావకాశంలేదు । సూచనచెయ్యండి ।

గు॥ అటైతే । నీవు శరీరంలేనిదానిలోవున్నావు ।

రా॥ నేనా। నేనా।

గు॥ యేమి।

రా॥ సరే। దానికి మొదలు లేదు। కొన లేదు।

గు॥ సరే।

రా॥ సూచన। ఆయు। యింకా అదేపుట్టనిచావనిది।
మరిహారోటినేను। యింమకుఅన। అదే రాకడాపోకడాలేనిది।

గు॥ యింకా।

రా॥ దానికి మొదలుకొనాలేదు।

గు॥ యింకా।

రా॥ యిఘమీరు దయచెయ్యండి। నేను మొద్దును। అనుకునేరని। మళ్లా సూచన
చేశినా। మీవంటివార్ని యవ్వర్ని చూడలేదు।

గు॥ సరే। శాబాస్।

రా॥ నేనేమి। నమమాత్రంవాశ్ని। మొదలు యేమీ లేదు। కొనకూ యేమీ లేదు
సార్వకాలం వొక్కతీరుగా వున్నది। శరీరం లేనిదిలెస్స। ఛీ। యంతదొడ్డది।అయి।
తే యేమీ। కొనకు యేమీ లేదు। నిలువనీడలేదు।

గు॥ విను। సార్వకాలం వొక్కతీరుగా చలించక। సకల దేశాలయందు। సార్వకాలాల
యందు। సమస్తమైనా వొస్తువులయందు। ఘట్టిగా వున్నది। సరేనా। యింమకు।
అనుమానం। వున్నదే।

రా॥ కోటిమాట్లకూ లేదు లేదు। అన్నాఅదేవున్నది "మూలంలేసి యీగుర్తైరిగేశరీరం
యేమీ లేదు"।అనిఅనంగానే। స్వతశిద్ధమైఅచలం। తనకు తానే వున్నది। ప్రయత్నం
చాత। సాధ్యం కాదు। ప్రయత్నంచేశే దియేమీ లేదు। గనక।

గు॥ సరే। సరే। రాజా ? యీశరీరం। యీలాగు లేదో। వక్కదృష్టాంతం చెప్పుమా।

రా॥ యీకలలో కోటియేనుగలువుండె। యిఘుచూడంగానే యేమాయ।

గు॥ యెమీ లేనిది। అందరికీ దృఢమే।

రా॥ నాకు। వారికి।వక్కటియెక్కువతక్కువ।

గు॥ యేమీ।

శి॥ మీమాంసూచనచేశినదాంన్ని చూడ్డమాచి। మళ్లాయింపున్న శరీరంయెమీలేదు।
అని। మునుపటిదృశ్యంవలేనే। దృశ్యంకద్దు।

గు॥ మునుపేవుంన్నదానికి। సంశయంలేదు। దృశ్యంలేదు। సార్వకాలంవక్కటేరే।

—( ఇతి శ్రీమద్గురుశివరామదీక్షితప్రభావే వేదాంత విచారణే, )—
* యాజ్ఞ్యవల్క్య జనక సంవాదంబను త్రైవింశతి ప్రకరణం. *

* తత్వము *

పల్లవి

త్రాహిగురురాయమాం। త్రాహిగురురాయమాం। త్రాహిగురురాయమాం।
త్రాహిగురురాయమా॥

అనుపల్లవి

నిరుపమానుండవగునిన్ను జేరితినన్ను। కరుణార్ద్రరక్షింపగదవెగురురాయా॥

చరణములు

దేహినివిదేహినని తెలుసుకొనునన్నట్టి। ద్రోహియనకను బ్రోవతూగుగురురాయా॥ త్రిపుటిద్విపుటులరెంటి తేరిచూడకనిత్య। మపరిమిత మజమచలమైనగురురాయా॥ లేని నేనను యరుకలోనిదే జగమివ్వి। లేనలేవెపుడు నీలోన గురురాయా॥ సోహమనికో హమని చూచుతననెప్పుడీ। యాహంభావన బాపుమయ్యగురు రాయా॥ క్షేత్రక్షేత్రజ్ఞులను చెడుగుమాయలనెంత। మాత్రిమంటపు సత్యమయ్యగురురాయా॥ విద్యయు నవిద్యయును ద్వివిధరోగముమాన్పు। వైద్యనాథోత్తముడ వయ్యగురురాయా॥ భాగవత వంశప్రభవకృష్ణవిబుధరా। యోగిసన్నుతనిరుద్యోగగురురాయా॥ జాలమాంనిక జన్మ సాఫల్యమునజంద కీలుదెల్పితివెంతో। కీర్తిగురురాయా॥

* రామస్తవరాజం *

ఉ॥ శాంతివహించికోకలు నిజంబుగదృంచిశరీరపోషణ।
భ్రాంతినిముంచి సజ్జనులపద్ధతులెంచివికారచంచల।
స్వాంతమువంచిమూఢజన సంగముడించి సదావివేకవి।
శ్రాంతినిమించి నిన్ననినజాణకె సద్గతిదేశికోతమా॥

* యోగవాసిష్ఠం *

కం॥ వినుమోక్షగృహద్వారం*బునకు శమంబును విచార*మును సంతోషం*
బును సాధుసంగమంబును*నను నాలుగు ద్వారపాల*కాఖ్యలునతా॥

గీ॥ దోషములు మ్రిక్కి యూమలు దుస్సహంబు। లైనదుఃఖంబులన్నియు నక్షణంబ।
శాంతిమదినానుసూత్రాన జడిశిపోవు। నరుణుడుదయింప జీకటియణగునట్లు॥

కం॥ విను నెడ కనుగోను నెడమూ *కోను నెడ ముట్టు నెడ చవులు * గోను నెడ మేల్గీ*
డును వచ్చినపుడు మోదం*బును ఖేదము లేనియుత్త *ముడు శాంతుడగున్॥

గీ॥ పొలుచు వేసక పెండ్లికి బోవునపుడు। నుగ్రుడై చంపగాని పోవుచున్న యడల।
చిత్తశాంతయు జల్లనై శీతకరుని। చందమున నున్న యాతడే శాంతుడండ్రు॥

గీ॥ తాపసులయందు శాస్త్రవిత్పున్నులందు। యాజకులయందు నృపులందు నతిబలాఢ్యు
లందు శమయుక్తుడగువాడు నధికుడండ్రు। అని యెరుంగుము మనమున మనుకులేశ॥

గీ॥ వినుము శాస్త్రార్థబోధ చేవిస్తరిల్లి। పూతమును నిర్మలమునైన బుద్ధి జేసి।
కారణము నెరిగి యాత్మవిచారమాత్మ। దవిలి చేయు మనునికి గర్తవ్యమనఘా॥

గీ॥ అంధకారంబునందున నణగిపోదు। దివసతేజంబునప్పుడు తిరిగిరాదు।
మెట్టిమరు పైననుంపించు యెదురు లేక। చారుతరమైనయట్టి విచారదృష్టి॥

కం॥ నేనెవ్వడ సంసారా * ఖ్యానంబీదోషమెట్లు*గలిగెనో యనుచున్ *
తానిజయుక్తిని దెలసుట * పూని విచారంబనాగ * బొలచు రఘువరా॥

కం॥ సంతోషము సుఖతరమగు * సంతోషము నిత్యమోక్ష * సంప్రాప్తియగున్ *
సంతుష్టుండెందును వి * శ్రాంతస్వాంతుండు రామ * సౌజన్యనిధీ॥

గీ॥ సర్వమానవులకు, సంసారతారణ। కారణంబు పుణ్యకారణంబు।
నై వెలుంగుచుండు నఖిలసంస్తుత్యమై। సాధుసంగమంబు జనవరేణ్యా॥

గీ॥ విమలమతులుసములువిగతసర్వగ్రంథు। లాత్మవిధులుసాధులైనజనులు।
సేవ్యులెందువారిసేవించుటయభవ। జడధియుత్తరింపగడగుతెరగూ॥

గీ॥ యుక్తియుక్తులైనసూక్తులుబాలుంతు। చెప్పెనేనివినుము చిత్తగించి।
అన్యమైనవచనమదిబ్రహ్మజెప్పిన। తృణమువోలెవిడువుధీరహృదయా॥

సీ॥ అనిజెప్పిమరియునిట్లనియెనుబ్రహ్మోప। దేశదృష్టాంతముతేటపడగ।
నింతయుజెప్పితినిదియేకదేశసామర్థ్యంబుగాగజిత్తమునవెరుగు।
మల్లెనిరాకారమైనబ్రహ్మమునందు। సాకారదృష్టాంతమైనయట్టి।
యపవిత్రములుప్రమోపాంతంబులునునగు।మూర్ఖవాదంబులీమొగిగుతార్కి
గీ॥ కత్వమొందకచిత్తంబుకలతబడక। శమదమాదులచాత సుజ్ఞానమొదవి।
యవిపరస్పరవృద్ధిమైయబ్జములును। సరసియునుగూడివర్ధిల్లుచందమొందూ॥

* రామస్తవరాజము *

గీ॥ కనకకండూతిదంతమర్వణమొక్క। తృణముచేబాయునటవాసుదేవకరుణ।
నంఘ్రివాకొప్పనిముంతుడైనట్టిమించి। జనునరునసాధ్యమగుప్రయోజనముగలదే

శ్లో॥ ఆత్మనోజ్ఞానమధ్యంచ। తథాహంకారవృశ్చికం।
తథాసంసారవహ్నిశ్చ। హ్యాశాపీడాపిశాచకః॥

[illegible]పంచమోహోన్మాదశ్చ। విషయాకాంక్షవాయసః।
మరణోత్పత్తివ్యాధిశ్చ। శాస్త్రేస్మిన్వైప్రకీర్తితం॥

* సానందోపాఖ్యానము *

వ॥ యిట్లనిస్తుతియించె.

( దండకము )

శ్రీమన్మహాదేవదివ్యప్రభావా భవానీజగన్మోహినీ భావరాజీవ సారంగ చర్మాం
బరాడంబరా శంబరాంకస్ఫురచ్చారు కోటీరకోటిగ్రహాధీశ తేజస్సమాజ ప్రకాశాగిరీ

శామరేశాజ ముఖ్యామరార్చితమ్య కల్యాణచంచద్గుణానేక దేదీప్యమానాగ్రమాణి
క్య నీరాజితాంఘ్రిద్వయాంభోరుహా మోహనాకారనిర్మోహ నిస్సంగ నిర్దోష నిర్ని
ద్ర నిర్లేప నిష్కూత పాపాజగద్వ్యాపనిత్యానుకంప ప్రధానార్థ నేశానుసారా మహో
దార దారిద్ర్యరోగాది దుఃఖాటవీఘోర కీలాకృశానూ వియద్వాహినీలోల కల్లోల
జాలాప్తిబాధాంగ శృంగార గంగోత్తమాంగా మదేభాసురాధ్యక్షభంగా హిరణ్యాద్రి
చాపా మృడానీపకందర్ప గర్వాపహారా భుజంగేంద్ర హారా పయోరాశి తూణీర
సివాది దేవుండవై సర్వముఖ్యప్రపంచంబు గల్పింప మన్నింప మాయింపగా కర్తవై
భర్తవై భోక్తవై సచ్చిదానందకందంబవై బ్రహ్మ వైకుంఠ భర్గాది నామంబులం
బ్రాఘివలింపుచున్ సత్యమై నిత్యమైయున్న నిన్నాత్మభావింపగాలేక లోకంబు నిస్సా
ర సంసార పాశంబులన్ జిక్కుచున్ పంచ భూతాత్మకంబైన దేహంబుపై మోహ
విభ్రాంతి రెట్టింప పంచేంద్రియాసక్తులై మత్తులై శత్రులంతొంట బాధింపగా బాల్య
కౌమారవార్ధక్య రూపంబులన్ బ్రాయమెల్లన్ వృథాపాయముం జేసి యాశానురక్తి
న్మహాఘోర కర్మంబు లిచ్ఛావిహారంబులం జేయగా డాయుచున్ రోయకే ప్రొద్దు
భామాకుచాలింగనా లోలులై కొంతగాలంబు సంసార తాపత్రయాభీల దావాగ్ని
సంతప్తులుంగాక నానావిధోపాయ కాపట్యసంయుక్తులై కోరికల్ గోరుచున్ పుత్రి
పుత్రీకళత్రాది సంఘంబులుం సంపదల్ జూచి కాయంబులుప్పొంగగా కొన్ని సంవత్స
రంబుల్ జనంగా జరాభార సాక్రాంతులై గంతులున్మాని చింతింపుచున్ శ్లేష్మ వా
తాది రోగంబులొక్కుమ్మడిం దొమ్మిగా చుట్టుముట్టన్ భయాపన్నులై దగ్గుచున్
మొగ్గుచున్ శిగ్గొకింతేమియున్ లేక దుఃఖంబునుం గ్రుంగి ప్రాణావసానంబున ... డి
దూతల్ మహారోష జాజ్వల్యమానాక్షులం జూచి శిక్షింపగా రౌరవానేక ...
పతాపంబులం బొందుచున్ కర్మశేషంబులం బొందుచున్ మర్త్యలోకంబునం బుట్టుచున్
గిట్టుచున్ సౌఖ్యలేశంబురుంగాన మిన్నున్ననీమాయ దాటన్ వశంబె భవత్పాద ...
రుహధ్యాన సంపత్తిసామాన్యమే భస్మరుద్రాక్ష దామాది చిహ్నంబులం ...
దాంత మధ్యోజ్జ్వలంబైన పంచాక్షరీమంత్రరాజంబునం బాపనిర్ముక్తులై యున్న భక్తుల్
భవన్నామసంకీర్తనాసక్తయుక్తుల్ గదా వారునీమాయగా మహాధర్మముల్ ...
ముల్ పుణ్యకర్మంబులున్ యజ్ఞముల్ యోగముల్ దానముల్ ధ్యానముల్ ...
ముల్ మంత్రముల్ యంత్రముల్ తంత్రముల్ పూజలున్ నీమముల్ సర్వమున్

కూడ నీసేవకుల్ సాటి రావంచు సర్వజ్ఞులెంచంగ నాలించి విించుచున్ సదా చంచలస్వాంతులై యన్యదైవంబులం గోరి ప్రార్థించినన్ భుక్తిముక్తుల్ ప్రసాదింపగా నేర్తురే నీవలెన్ లోకమెల్లం భవద్దివ్య తేజోమయంబంచు చాటింతురెల్లప్పుడున్ బూర్వపుణ్యపరిపాకంబునన్ గన్నులారన్ మిమ్ముం జూడగంటిన్ తగన్మోక్షసామ్రాజ్యమె కొల్లగైకొంటి ధన్యుండనైతిన్ మదియ్యంబులై యున్న నేరంబులూహింపగా నేర నన్నుం గృపాదృష్టులం జూచి రక్షింపవే సర్వలోకప్రశస్తా మహాశూలహస్తా నిశానాథమస్తా నమస్తే నమస్తే నమస్తే నమః॥ * * * * *

* వచనము. *

దేవా? నీవు పరంజ్యోతి స్వరూపుండవు ప్రకృతికవ్వలవెలింగెడు పురాణపురుషుండవు, విశ్వమయుండవు, విశ్వవ్యాపకుండవు, విశ్వాకారుండవు, విశ్వాధికుండవు, త్రిగుణస్వభావుండవు, గుణాతీతుండవు, ఆదిమధ్యాంతశూన్యుండవు, మూలకారణుండవు, సచ్చిదానందబ్రహ్మంబవు, ఇట్టి నీవు జగన్నాటకుండవైన మహాదేవుండవు. [illegible] ప్రపంచంబున జరా చరాది సమస్తభూతంబులును, ఋక్షులును, మహేంద్రాది దివిజులును, [illegible] ప్రభృతిగ్రహంబులును, గరుడ గంధర్వ సిద్ధ విద్యాధరాది దేవయోనులును, యక్ష రాక్షస గణంబులును, శేష వాసుకీ తక్షకాది మహానాగంబులును, ఐరావత సార్వభౌమాది మాతంగంబులును, ఉచ్చైశ్శ్రవ ప్రముఖతురంగంబులును, పారిజాతాది ధరణీరుహంబులును, నారద వసిష్ఠ విశ్వామిత్రాది మహర్షులును, రంభాదిదివ్యసుందరులును, పృథివ్యాపస్తేజో వాయురాకాశంబులును, సప్తకులపర్వతంబులును, సప్తద్వీపంబులును, గంగాదిపుణ్యనదులును, మహారణ్యంబులును, వేదంబులును, వేదాంగంబులును, ధర్మంబులును, కాలంబులును, మాసాయనఋతుసంవత్సరంబులును, అహోరాత్రంబులును, మొదలుగాగల సర్వజగంబులును, (శివాత్పరతరం నాస్తి) యనిఘోషించుచున్నయది.

ఇట్లు బ్రహ్మాండకోట్లు నీయుదరంబునం గల్గియుండుదువు చంద్రబింబంబొక్కండనేకజల పూర్ణఘటంబులం బ్రతిఫలించుచందంబున స్వరూపంబుల నీవయై కాష్ఠగతాగ్ని ప్రకారంబుల నంతర్యామివై తెలియంబడకుండ మణిగ్రథిత

సూత్రంబుకైవడిని లోభమనంబుల నొక్కరుండవై ప్రకాశింతు. విట్టిసి మహామ హిమ బ్రహ్మాదులైనం దెలియలేరు మిమ్ముంగొనియాడ నేనెంతవాడ కొందరు ధ్యానవేదులు పంచభూతాత్మకంబైన దేహంబుపై మోహంబు దిగనాడి జ్ఞానేంద్రియపంచకంబును, తద్విషయపంచకంబును, ప్రాణపంచకంబు, అంతఃకరణ చతుష్టయంబునకవ్వలితత్త్వంబు దెలిసి సోహంభావనులై, పిపీలికాది బ్రహ్మపర్యంతంబు పరబ్రహ్మస్వరూపంబుగా భావింతురు. కొందరు సగుణస్వభావుండవని చంద్రకిరీట త్రిశూల డమరుగ భుజంగహార కేయూరాది చిహ్నంబుల నిర్మల స్ఫటిక వర్ణంబుంగల దేవుండవని నీయందుభక్తి భజన ధ్యానంబులుంగలిగి వర్తింతురు గొందరుం గనకమణికుండల గ్రైవేయ కిరీట శంఖ చక్ర కౌస్తుభాది లక్షణంబుల నీలమేఘశ్యామాభిరాముండవని నిన్నుంగొనియాడుదురు గొందరు మంత్రరహస్యంబవని పంచాక్షరీ మహామంత్రరాజంబున నిన్నుంజపియింతురు గొందరు హఠయోగ రాజయోగంబులంగల నాదబిందు కళాతీతుండవని యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార. ధ్యాన ధారణ సమాధి నిష్ఠాగరిష్ఠులైన యోగం [illegible] చందంబున నెన్నిమార్గంబులం దమరు నశియించినందుది నందరకుం బొందదగిన మహాపురుషుండవు, దయాసముద్రుండవు, నిర్వికారుండవు, నిరంజనుండవు, నిర్వికల్పుండవు, అనాథనాథుండవు, అకారణసుకృతివి, ఆర్తత్రాణ పరాయణుండవు, అనంతకోటి బ్రహ్మాండ నాయకుండవని, యిట్లనేకభంగులం బ్రస్తుతింపం బ్రసాదభావంబున మందస్మిత సుందరకందళిత వదనారవిందుండై యిందుశేఖరుం డిట్లనియె. * * * * *

## * కందార్థము. *

౨౮* మొగ్గలనైనను దొల్తురు * బద్ధులబద్ధత్వమడవి పాజ్ఞేతురుమీం * నద్దికి వచ్చినగని*పరి-శుద్ధపుబోధోక్తమైన*సూక్తాలుగుప్పి*అందుకుతగిన*యుక్తాలు జెప్పి* పెద్దాలచేమీ ప్రసిద్ధినివినినవస్తి * దిద్దూడి నేనట్టి బుద్ధిహీనుడనన్ను * సూక్తాలుగుప్పి* అందుకుతగిన*యుక్తాలు జెప్పి॥ * * * * *

* శ్రీ శి వ రా మ దీ క్షి తీ య మ ను బృ హ ద్వా శి ష్ఠం *
( అ చ ల బో ధ సి ద్ధాం తం )

శి॥ యీకలలోనే। అనేక వింతలు కొచిపాయి। యదార్థంగా భ్రాంతిలేనిరాజమార్గం। సూచన చెయ్యండి।

గు॥ చేస్తావిను। యీకలలో। వకమనిషి వచ్చె। వచ్చె। కొంతసేపు వుండె। వెంటనే। చూస్తూవుండంగానే యేమీలేదు। యిదినీకు దృశ్యమూ। అనుమానమూ।

శి॥ దృశ్యమేకాని। కలలో వచ్చేవి అయోనిసంభవాలు। యిప్పుడు యోనిసంభవాలు। యేలాగు అవును?।

గు॥ కలలోనే। స్త్రీపురుష సంయోగం లేదా। పెద్దవారు కారా। పసుగులు కావా। వివాహాలు కావా। మళ్లా కొడుకులు బిడ్డలు పుట్టరా। దొరతనం చెయ్యరా। భిక్షమెత్తరా। దానికీమూలం యేమీలేదు। దీనికీమూలం యేమీలేదు। నీకు యేమైనా యెక్కువ తక్కువ తోచెనా చెప్పు।

శి॥ భ్రాంతి మేలుకొన్నదాకా తప్పదు। వున్నంతసేపూ। యీకల నిబద్ధవలె వుంటుంది। వెంటనే గుర్తెరుగుతుండగానే। యేమీలేదు।

గు॥ అదివున్నప్పుడే। గుర్తెరుగుదువు। ఆలాగే గర్భిణీ అయింది నీవే గుర్తెరుగుదువు। కొనవుచస్తే యేమీలేదని। నీవే గుర్తెరుగుదువు। కలకూ దీనికీ యెక్కువ తక్కువ యేమీ?।

శి॥ యేమీ యెక్కువ తక్కువ లేదు।

గు॥ సరేకదా? నీకు వక భ్రాంతి వున్నది, అది పోకడ బెట్టుకొంటివే। నీకంటే అధికులు లేరు।

శి॥ అదీ యెటువంటిది। సూచన చెయ్యండి।

గు॥ చేస్తాగాని। యెక్కువ ప్రసంగాలు చెయ్యవుగదా.

శి॥ యింతమీకు భయం యేమీ। ప్రసంగం పుట్టకుండా సూచన చెయ్యండి।

గు॥ నేను చెయ్యంగానే యేమీ। నీవు కనుక్కోవలె।

శి॥ వున్నట్టు చెప్పితే। యెటువంటి మొద్దుకూ। వినంగానే తనకుతానే। తోస్తుంది।

గు॥ నీమాట సరేకాని। యీకలలో। వచ్చిన శరీరాలు। మనకు యిప్పుడు। కానవచ్చే శరీరాలూ। సమానమూ యెక్కువ తక్కువా?

శి॥ యేమీ యక్కువతక్కువ లేదు।

గు॥ నిబద్ధే ।నిబద్ధే। యిందుకుఅనుమానంయెషువంటవారికైనా లేదు। యిదిహాస్యూటిదే ।యిదిఅందరికీయరుకేకద।

శి॥ యెరికే।

గు॥అనైతే। నీవుయేమీ।

శి॥ నేను మూలంలేనియీగు రైరిగే శరీరం

గు॥ కలలోవచ్చినశరీరాలకూ మూలంయేమీలేదు। కలలోవచ్చిన శరీరాలు। యవ్వరిసత్తాచాతవున్నావి।

శి॥ వాటికీ అవ్వే। వాటికి సత్తా యవ్వరిదీలేదు। వాటివల వీటికీయవ్వరి సత్తాలేదు। వీటికీయివ్వే।

గు॥ యీశరీరాలరమ్మనేవారు లేరు। వుండుమనేవారు లేరు। పొమ్మనేవారు లేరు। విచారించనిమూఢులు। వీటకీమూలం వున్నదని। భ్రాంతిచాత వున్నారు

శి॥ విచారిస్తేఅందరికీమూలంయేమీ లేదని యెరికే।

గు॥ అనైతెనీశరీరం। కలలోవచ్చిన శరీరాలవంటిదే। కానుపించేశరీరాలవంటిదే।

శి॥ యేలాగైనావొక్కటే। కలలోవచ్చిన శరీరాలవంటిదైనా యేమీలేదు। మనకుకానుపించే శరీరాలవంటిదైనా యేమీలేదు।

గు॥ అనైతె నీకు శరీరంవున్నట్టా లేనట్టా?।

శి॥ నాకా?

గు॥ కలలోవచ్చిన శరీరంమేలుకొంటే వున్నట్టా లేనట్టా?

శి॥ మేలుకొంటే యేమీలేదు। కొంచమైనాలేదు। యీశరీరంయేమీలేదు।

గు॥ యెప్పుడు। చస్తేనా?

శి॥ ఛీ। యెప్పుడువిచారిస్తే। అప్పుడే। గురుకటాక్షంచాత యేమీలేదు।

గు॥ నిబద్ధే। నిబద్ధే। యిందుకు అనుమానంయేమీ।

శి॥ కొందరుచస్తెయేమీ లేదు। అంటారు। ఆలాగైతె। గురువు యెందుకు। విచారానకూ। ఫలంయేమీ। చచ్చినతరువాత। భ్రాంతియెవ్వరికి।

గు॥ ఛీ। అదిమాటకాదు। చచ్చేదియేమీ। మొదలు యేమీలేదు। కొనకు యేమీ

లేదు । యీలాగు అందరికీ సమానమే । గురుమూలంగా విచారించిన వారికి । యెప్పుడు విచారిస్తే అప్పుడే "మూలం లేని యీగు త్రైరిగే శరీరం యేమీ లేదు"

శి॥ సరే । సరే । యిందుకు అనుమానం లేదు । గురుస్వామీ? నాకు రెండు అబద్ధాలు తోస్తావి ।

గు॥ యేవి అవ్వి ।

శి॥ సుషుప్తి అనే మాట । మరణం అనే మాట ।

గు॥ అది యేలాగు? ।

శి॥ మూలం లేని యీగు తెరిగే శరీరం యేమీ లేకుంటే యేమో ।

గు॥ సరే । అది జాడే । సుషుప్తి అని । మరణమని । మంది కల్పించినారు । యింతే కాని । వున్నది వొక్కటే । మూలం లేని యీగు తెరిగే శరీరం । వున్నంత శేపూ ! కలే । గురుమూలంగా కలలో వచ్చే శరీరాలు । యెరుకతోటివుండగానే । యేమీ లేదు । అని తనకు తాను యేలాగు దృష్టమో । ఆలాగే । గురుమూలంగా "మూలం లేని యీగు త్రైరిగే శరీరం యేమీ లేదు" అని తాత్పర్యమాయనా । అదే మేలుకొనుట । యింతే కాని । వొక్కటైనా । అవస్త లేదు । స్వప్నావస్త గురుడు మేలుకొలిపితే । అదే జాగ్రిత । యింతే కాని । నాల్గు అవస్తలు లేవు । యీ శరీరం వొక్కటే । నాలుగు శరీరాలు అనుట అబద్ధాలు । మూలం లేని యీగు త్రైరిగే శరీరం । స్వప్నావస్త । గురుకటాక్షం చాత మేలుకొంటే । అప్పుడే జాగ్రిత । యింతే కాని । యెక్కువ తక్కువ । ముచ్చట్లు యేమీ లేవు

శి॥ స్వామీ? నాకు చాలు । మీరూ కష్టపడితిరి । శిష్యుడు మొద్దు । యేమో అని । మహా భయపడితిరి । యిటువంటి ముచ్చట మువ్వరికీ దృష్టం కాక పోయ్యేనని । మీరు భయం విడువండ్రి । యెంత మొద్దులు అయినా । అనాయాసంగా । తనకు తానే । దృష్టం అవుతుంది యేమైనా ఆయాసం వున్నదే । అతి సులభం । యిటువంటి సులభం యెన్నడూ వున్నదని వినలేదు । మహా కఠినం । వున్నదని విన్నా । అనేక సాధనలు విన్నా । కొన్ని నేను చేశిన । యిప్పుడు విచారించుకుంటే । గట్టుకు మోశిన కట్టెల వలె వుండే । వక్క సాధన అక్కరకు రాక పాయె । సముద్రం కాళ్ల చాత నడచి పోయినట్లు ఆయె ।

గు॥ శాబాస్ ।

శి॥ గురువు అంటె । యీలాగు వుండవద్దా ।

గు॥ శాబాస్ ।

—( ఇతి శ్రీమద్గురుశివరామదీక్షితప్రభావే వేదాంతవిచారణే, )—

* భ్రాంతిరహితప్రకరణం *

## * ఆనందానుభవము. *

( ద్విపద )

అనుటయుగురునాథు నడుగుల కెరగి * వినయంబుతోడనా విప్రుడిట్లనియె *
ఆచార్య దుఃఖదాయక దేహబంధ * మోచనంబున కెద్ది ముఖ్యసాధనము *
ఆనతియిమ్మన్న నాగురుస్వామి * జ్ఞానంబెపో ముఖ్య సాధనంబనుడు *
అట్టిజ్ఞానంబు వేదాంతముఖమునను * ఘట్టిగా దెలిశి సుఖంబుండుమనియె *
నాపుడుభూదేవ నందనుడాత్మ * లోవివేకమున యాలోచన జేశి *
వేదాంతమర్మంబు వివరించిచూడ * నాదిమధ్యాంతంబు లరయంగవలయు *
తమపయుక్తంబైన తర్కశాస్త్రంబు * మొదటినుండియుతుద ముట్టంగజదివి *
మతరహస్యములు వేమనుగనవలయు * అంతయుశ్రవణాను లయ్యెనుగాని *
యింతయుసాధింప నేదిగాలంబు * తెంపునయీమేను ద్రెళ్ళినసూటి *
దప్పిచేశినప్రయత్నము రిత్తయగును * కానసంక్షేపమార్గమునసుజ్ఞాన *
తానంబుజేశి సంతాపంబుదీర్పు * మనుచుగద్గదకంఠు డైతనపాద *
వనజాతములమీదవ్రాలె వ్రాలుటయు * సొంపుతోచల్లని చూపులజూచి *
కంపించవలదని కరముల నెత్తి * సిద్ధాసనాసీను జేశియాశిష్యు *
బుద్ధినిర్మలముగా బోధింపదొణగె * నీనిజరూపంబునీవెరుంగమిని *
మానక దేహాభిమానివైనావు * నీవుదేహముగావు నీవుప్రాణములు *
గావహంకారంబు గావుచిత్తంబు * గావుమనంబును గావుబుద్ధియును *
గావువాక్కునుపాణి గావుపాదములు * గావుపుపస్థయు గావుపాయువును *
గావుశబ్దంబును గావుస్పర్శంబు * గావురూపంబును గావురసంబు *
గావుగంధంబును గావురజంబు * గావుసాత్వికమును గావుతమంబు *
గావుస్థూలంబును గావుసూక్ష్మంబు * గావుకారణమును గావుపురుషుడవు *
గావునపుంసకాకారస్త్రీత్వములు * గావుదీర్ఘంబును గావుహ్రస్వంబు *

గావుభావమునీవు గానభావంబు * నీవుభేదముగావు నీవుమోదంబు*
గావిన్ని యెరుగు ప్రకాశంబునీవు * నీవఖండముసత్తు నీవుసంవిత్తు*
నీవుసదానంద నీరధివరయ * నీవచలుండవు నీవమలుడవు*
నీవక్షయుండవు నీవభయుడవు * నినునీవుచింతింప నీకంటెపరము*
గనుగొనలేదింక ఘనతగన్గొనుము * నిఖిలలోకంబులు నీయందుగలవు*
నిఖిలలోకములందు నీవునుగలవు * పరునడిచిత్తవి భ్రాంతిబోవిడచి*
పరికింపయిదిబట్ట బయలౌనునీకు * పెక్కుబుద్ధులుమాని ప్రేమతోనమ్మి*
పొక్కబుద్ధినినిల్వ నొదవునీవిద్య * యిదిబంధమోచన మిదిరాజయోగ*
మిదిసులభోపాయ మిదిరహస్యంబు * పరులకుజెప్పక భక్తులైనట్టి*
నరులకుజెప్పియానందమునబొందు * మనియుపదేశింప యాశిష్యవరుడు*
తననిజరూపంబు తానిశ్చయించి * ఆనందరూపుడైయలరు సద్గురుని*
నానావిధములవర్ణనచేసిపొగడి * గగనంబులోపలి ఘటముచందమున*
మొగినిజాంతర్బాహ్య మునశూన్యుడగుచు * సరసిజలోపలి కలశంబుచందమున*
పరగలోపలవెలుపల పూర్ణుడగుచు * శాంతుడైచిద్విలాసమునవర్తిలుచు*
మ్మంతనంబునతన మనసునీక్షించి * మనుసరాగదవె నీమహిమలెంచెదను*
మునుసచ్చిదానంద మునుసద్వయంబు * అనఘమైనట్టిబ్రహ్మమునందునీవు*
కనుగొనలేకనే కలిగినవెలుగు * యీశ్వరుకామించి యిచ్చలుగరపి*
విశ్వముల్గలపించి వివిధవాక్యములు * జీవులబుట్టించి జీవులనెల్ల*
భావింపగుణపాశ బద్ధులజేసి * సంతతసంసార జలధిముంచితివి*
యింతవింతైననీ యింద్రజాలంబు * యెండమావులనీరు యలమిశుక్తికను*
వెండి రజ్జువునదర్వీకరాగంబు । పురుషుండుమొద్దున బొరిదోచినటుల*
పరమాత్మయందు ప్రపంచంబుదోచె * నాపుణ్యవశమున నాగురుస్వామి*
చేపట్టియీకీలు చెప్పిసత్కృపను * వేగదేహాధ్యాస విడిపించగాను*
బాగుగాదెలిసితి పరమాత్మవిధము * మానునజేసిన మదకరికల్ల*
యైనతెరంగున ఆత్మనుదెలియ * జగమసత్యంబాటసందేహమేమి*
వగలకారిమనంబ వదలుమింతటను * నిలిపెదననినిన్ను నిగ్రహించినను*
నిలచినట్లనెవెగడి నిలువవంతటను * ధరకుక్కతోకను బద్దలుగట్టి*

అరుదుగాబిగియింప నదిచక్కనగునె * నీజాడవినుతువా నినుబట్టినాను*
నీజోలిమాకేల నీపుమాకేల * మమ్మెరింగితిమింక మాకేమిభయము*
పొమ్మన్నచిత్తమాపుణ్యునికసియె * నోవిప్రకులచంద్ర నోపుణ్యమూర్తి*
భావింపనగణిత బ్రహ్మకల్పముల * నుండినీతోగూడ నుంటినిన్నాళ్లు*
పాండిత్యమున నేడు పాయజూచెదవు * నీవునావశమైన నేనెపుడేగి*
కావించుపనులు లెక్కలుబెట్టవశమె * సంతతంబును నిజేచ్ఛలబొందరాని*
కాంతలబొందుదు కావరంబునను * పొల్లుబోవనిరీతి భుజియింపరాని*
కూళ్లుభుజింపుదు కూచితనాన * త్యాజ్యముల్ గాకచంతల యేలరాని*
రాజ్యంబు లేలుదు రాజసంబునను * క్రూరభావంబుగై కొనిచంపరాని*
వారలజంపుదు వైరమార్జించి * యికనేమి శేయుదు యెచటికేగుదును*
తెక తెక జెడితినా తెరగెల్లదప్పి * ఆనీటమునిగి నీరైనట్టిలవణ*
మునుబోలెయమ్మహాత్మునియాత్మయందు*మనుసులయంబయ్యేమాటమాత్రమున
ఘనతేజమందు చీకటియేలనిలచు * మానితానంద సాంబ్రాజ్యపట్టమున
భానుంహుజలధర పటలంబుబాసి * తేజరిల్లినమాడ్కి తేజరిల్లుచును*
నాజగన్మయుడొప్పె ననియివ్విధమున * సంక్షేపమునఆత్మసాక్షాత్కరణము*
కాంక్షదెల్పితియింత కన్నను లేదు॥

*దోహరా*

సూరతుసేకీరతుబడీ। బినపంకఫ్రుడుజాయ్।
మైసీలక్ష్మిదాతేకీ। తీనలోకమేఫిరుజాయ్॥

*కందార్థము*

౨౯ * సూటిగనుబోధనామది * నాటినదికచాలుచాలు * ననినీకైనీ * నోటనివు బల్కుదాకను * సాటువల నుజెప్పుచుందు*సరేనా నామాటా*రాగోరూచు*మరినేనీ మాటా * నూటికొక్కటిశేలు మాటగాని తెలియూము*మాటిమాటికివట్టి పాటాలేమి టికింక * సరెనానామాటా * రాగోరూచు*మరినేనీమాటా॥

కం॥ నీమదికీనిజబోధ * ప్రేమతోనాటించదలచి * పెక్కువిధముల*
నే మొదలుబెట్టిచెప్పితి * దేమాత్రిమురాత్రిబగలు * యేమారకుమీ॥౧౮౬

* శ్రీ శి వ రా మ దీ క్షి తీ య మ ను బృ హ ద్వా శి ష్టం *
( అ చ ల బో ధ సి ద్ధాం తం )

శి॥ యీకలలోనే । వక్కమనిష్యివచ్చేవస్తూనేనాకుయనమిది దృష్టాంతరాలతో । సూచనచెయ్యండీఅనె । అంటె ।

గు॥ మాబాగు అనే । సరేకాని । నీవుయేమీఅనిఅడిగే । అడిగితే ।

శి॥ నేను । మూలంలేని యీగుర్తెరిగేశరీరంనుఅనే ।

గు॥ యీశరీరానకు । యవ్వడైనాధారవున్నాడా ।

శి॥ నేనుధారనుయరుగ । దారసాన్నయరుగ । నాకు మొదలుయేమీలేదని । నాకు యరుకే । నాతోకూడావచ్చినవారే అతిప్రీతిచాత । పడివుండి । తనవంటి ఆడదాన్ని । తగిలి । కొడుకులూ బిడ్డలూ । కంచూవున్నవారం । మాకుదుఃఖంపట్టదు మేమురెండు । మాగాలవున్నాము ।స్వతశిద్ధమైమాకు మేమేవస్తాము । వొఘవేళ కడుపులోవుండి । వెళ్లివస్తాము । మాకుఅనంతమైన ప్రకారాలు । అన్నిన్మాణాలు । చేశినాము । మాకంటె అన్యం ।పుట్టని చావనిది । దానికి । మొదలు యెక్కడవున్నాదో । కొనయెక్కడవున్నాదో ।

గు॥ దానికి రాకడా లేదు । పోకడా లేదు । సార్వకాలంవొక్కతీరే । శరీరం యన్నటికి లేదు । క్రియాశూన్యమైంది । సకలదేశాలయందు । సార్వకాలాలయందు । సమస్తమైన వోస్తువులయందు । చలించక తనకుతానే । స్వతశిద్ధమైవున్నది । దానికి వొక్కటైనాపేరులేదు । దానికి అదేకాని । రెండోది బదలులేదు । మూలంలేని యీగుర్తెరిగేశరీరానకు । మర్యాదాలేదు । యిన్నాళ్లు వునికిఅని । తనసమాధానమేకాని । రెండోదాన్ని చూచి । భయపడదు ।

శి॥ రెండోదిఅంటే ।

గు॥ పుట్టనిచావనిది ।

శి॥ అదే అంటే । నాస్థానమే అది । నేనువుండేది । దానియందు । పుట్టనిది । మాతో సంభాషణ చాయదు । మేముదాన్ని । పుష్టిపెట్టి । వ్యవహారం చాయము । మాకుఅదిమూలం కాదుగదా । మళ్లా ప్రవేశించేటందుకు । స్థానంకాదుగదా । మాసుఖమేమో । మాదుఃఖమేమో । వున్నంతశేపూవుండవలె । లేకుంటే యేమీలేదు । దానికి మాకుసమ్మంధంవుంటే । అదీయిదీ వొక్కటేఅవును । యీది

మధ్యచ్చి। మధ్య నేయేమీలేదు। అదిసార్వకాలంవొక్కటీరే। యిది యెప్పుడు
విచారిస్తే అప్పుడే యేమీలేదు। అది విచారించినా విచారించకున్నా। సార్వ
కాలం చెలించక। తనకుతానే స్వతశిద్ధమై వున్నది।

గు॥ స్వతశిద్ధమైవున్నది గనకనే। సాధనచాత సాధ్యంకాదు। అదీనేను వొక్కటే
అంటె। యవ్వరునమ్మరు। వక్కటీసరిపోదు। మూలంలేని యీగుర్తెరిగేశరీరం
చంచలం। అదిక్రియాసూన్యమైంది। సకలక్రియలకూ। మూలంలేనియీగుర్తె
రిగేశరీరమేమూలం। పుట్టనిచావని దానియందేవున్నానుఅంటివి। అందరూఅ
నంగా। అన్నావా। నీకుదృష్టమా।

శి॥ అదిష్టానమనిఅనుకోంగాఅన్నా।

గు॥ అదిష్టానమువుంటె। నీకుమూలంవుండనేవుండే। మళ్లా ప్రవేసించ్చేటందుకు।
స్తానంఅదికాదాయేమీ।

శి॥ యేమీ। ఛీ। ఛీ। అదియేమీలేదు।

గు॥ నాకుమూలంవున్నదనీఅంటె। తలలుకొట్టించ్చే। కొనకు ప్రవేశించ్చేటందుకు।
స్తానంవున్నదిఅనిఅంటె। మెడలకువురులుబోయించ్చే। ఛీ। ఛీ। అటువంటిఅధికమైన
అబద్ధాలు। వెనకయెందరుకూసినాయేమీ। యెదురుగానిలబడిఅనుమను। యెవ్వ
డుఅంటేవాడే। పుట్టేవాడు। కొనకుయేమీలేకపొయ్యేవాడు। పుట్టనిచావనిది
సంభాషణచేస్తుందీఅని। చచ్చినశవాల। తినేవాండ్లు। అయినాఅనరు। తలలుగొరి
గేవాండ్లుఅయినాఅనరు। బట్టలువుతికేవాండ్లు అయినాఅనరు। పుట్టని చావని
దానికి। వక్కటైనావికారంలేదు। సార్వకాలంవొక్కటీరే।

శి॥ నేనుదానియందేవున్నా। గాని। నాకుఅధిష్టానంమరియాదా లేదు।

గు॥ యిఘ యేమీ।

శి॥ దానికీనాకు యీపత్తుఅయినా। సంబంధంలేకవున్నాము।

గు॥ యిదిసరే। యిదీఅందరికీ। సమాధానమే।

శి॥ శీఘ్రింగానాకుసూచనచెయ్యి।

గు॥ తెస్నవిను। నీకుమొదలూయేమీలేదని। నీవుయెరుగుదువుగదా। కొనకు యే
మీలేదని యెరుగుదువుగదా।

శి॥ ఘట్టిగాయెరుగుదు।

గు॥ నేనుయిషువంటిదిఅని । నీకుసూచనచేస్తానో । నిప్పుఅషువంటి దానియందు । కూర్చున్నావు । దాన్నివుండచూడు । అదేపుట్టనిచావనిది । మొదలుకొనాలేనిది। రాకడాపోకడా । లేనిది । సకల దేశాలయందు । సార్వకాలాలయందుసమస్తమైనవస్తువులయందు । చెలించక । సార్వకాలం । వాక్కుతీరుగా వున్నది । తనకుతానేస్వతశిద్ధమై।

శి॥ సరే । సరే । యిటువంటి చెలించని దానియందే । నేను వున్న । యిందుకుఅనుమానంలేదు । నాకు సుఖమైనా । దుఃఖమైనా । వుంటుంది । నేను దానికంటే । వేరేవున్నట్టూవున్న । యిదియేమీలేక । అదేవుండేట్టుచేతురు ।

గు॥ ఆలాగేసూచనచేస్తాగానీ । యెనమిది వుపమానాలు చెప్తామంటివి । యెనమిది యేలాగు । ప్రత్యేకంగా వున్నావో । ఆలాగే । పుట్టని చావనిది । వున్నది పుట్టనిచావనిది వున్నాదోలేదో । రాకడపోకడలేనిది । వున్నాదోలేదో । శరీరంలేనిది వున్నాదోలేదో । భోంచెయ్యనిది వున్నాదోలేదో । సకలదేశాలయందు ।వున్నాదోలేదో । సమస్తమైన వస్తువులయందువున్నాదోలేదో । సార్వకాలంవాక్కుతీరుగా । చెలించక । తనకుతానే స్వతశిద్ధమైవున్నాదోలేదో । అని అనుమానంలేదుగదా।

శి॥ అనుమానంలేదుగాని । మూలంలేనిదిగనుక । యీగుర్తేరిగే శరీరంఅందరికీ । కొనకు యేమీలేనట్టు । మాకుఆలాగు అయ్యేనని భయం ।

గు॥ నీకుయేలాగుకావలే ।

శి॥ గురువాక్యం యెప్పుడువింటే । అప్పుడేవుండవలె । లేనిదియేమీలేక పోవలే ।

* మొదటి వుపమానం *

గు॥ మంచిది । నీకుఆలాగేఅయ్యె । పుట్టనిచావనిది । సూర్యుడు వున్నాడో లేడోఅని అనుమానంలేనట్టువున్నది ।

శి॥ అదియేమీ । సాయంకాలానికీయేమీలేదు । యిదిఅచలం ।

* రెండవ వుపమానం *

గు॥ చెంద్రుడువున్నాడోలేడోఅని । అనుమానంలేనట్టు । రాకడపోకడలేనిది వున్నది

శి॥ అదియేమీ । తెల్లవారీయేమీలేదు । యిదిసార్వకాలంవాక్కుతీరే ।

* మూడవ ప్రమాణం *

గు॥ భూమి ప్రత్యక్షంగా । వున్నట్టు । మొదలుకొనా లేనిదివున్నది ।

శి॥ యీభూమికి మొదలు । కొనవున్నది । తనకుతానే స్వతశిద్ధమై వున్నదానికీ । మొదలుయెవ్వరూచూడలేదు । కొన యెవ్వరూచూడలేదు । యీశరీరంవంటి వే యివిఅన్ని ।

* నాల్గవ ప్రమాణం *

గు॥ పుట్టనిచావనది । నిష్ప్రత్యక్షంగా వున్నట్టువున్నది ।

శి॥ ఆలాగేవున్నదిగాని । కట్టె లేకున్నా । పిడక లేకున్నా । యేమీలేదు । పుట్టని చావనిదానికీరెండోదియేమీలేదు ।

* ఐదవ ప్రమాణం *

గు॥ పుట్టనిచావనిది । శరీరంప్రత్యక్షంగా వున్నట్టువున్నది ।

శి॥ శరీరంవున్నప్పుడూవుండదు । శరీరం లేకుంటే లేక పోదు । సార్వకాలంయేమీలేదు మూలం లేనియీగుతేటిగేశరీరం। '

* ఆరవ ప్రమాణం *

గు॥ పుట్టనిచావనిది । సార్వకాలం । ముందర పెద్దఘట్టావున్నట్టువున్నది ।

శి॥ ఘట్టాయక్కడవుంటే అక్కడనేవున్నది । పుట్టనిచావనిది । సకలదేశాలయందు వున్నది ।

* శ్రీభగవద్గీతా *

శ్లో॥ అవినాశితుతద్విద్ధి । యేనసర్వమిదంతతం ।
వినాశమవ్యయస్యాస్య । నకశ్చిత్కర్తుమర్హతి॥

తా॥ దేనిచేత ఈసకలప్రపంచమును వ్యాపింపజడినదోఆట్టికేవలాత్మనాశము లేనిదని తెలియుము. నాశము లేనియీ కేవలాత్మకునాశముగలిగించుట ఎవరికినిశ్శకము గాదు. (యీశ్లోకము బ్రహ్మతత్వమును గూర్చినదని శంకరభాష్యము.)

* ఏడవ ప్రపమాణం *

గు॥ గనక యీపుట్టని చావనిదీ। పెద్దచెట్టూ వున్నట్టువున్నది।

శి॥ చెట్టువంటిది కాదు। పుట్టనిచావనిది గొడ్డండ్ల ఛేదింపబడదు। నిప్పుచాతకాలంది నీళ్లచాతచీకంది। యండచాత। ఘాలిచాత। యెండిపోంది।

* శ్రీ భగవద్గీతా *

శ్లో॥ నైనంఛిన్దన్తిశస్త్రాణి। నైనందహతిపావకః।
నచైనంక్లేదయంత్యాపో। నశోషయతిమారుతః॥

తా॥ యీకేవలాత్మను ఆయుధములు నరుకజాలవు. అగ్ని దహింపజాలదు. నీళ్లు తడుపజాలవు. వాయువుయెండింపజాలదు.

శ్లో॥ అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్యఏవచ।
నిత్యస్సర్వగతస్థాణు। రచలోఽయంసనాతనః॥

తా॥ ఈకేవలాత్మ ఛేదింప నలవిగానిది, దహింపనలవిగానిది, తడుపనలవిగానిది, ఎండింపనలవిగానిది, నాశములేనిది, అంతటను వ్యాపించియుండునది, స్థిరరూపముగునది, చలింపనిది, అనాదియైనది.

శ్లో॥ యఏనంవేత్తిహంతారం। యశ్చైనంమన్యతేహతం।
ఉభౌతౌనవిజానీతో। నాయంహంతినహన్యతే॥

తా॥ యెవడీ కేవలాత్మను వధించుదానిగా దలంచుచున్నాడో, ఎవడు ఈకేవలాత్మనువధింపబడుదానిగా దెలియుచున్నాడో, వారిద్దరును దెలియనివారలు. ఎందువల్లననగా నీకేవలాత్మ వధించునదియునుగాదువధింపబడునదియునుగాదు కర్తృత్వ, కర్మత్వములు రెండును కేవలాత్మకు లేవు. అవివికారములుగాన పరబ్రహ్మకవిలేవు.

* యెనిమిదవ వుపమానం *

గు॥ ప్రత్యేకంగా । స్త్రీముందరవున్నట్టూ । పుట్టనిచావనిదీ। కండ్లముందరవున్నది।
శి॥ స్త్రీనంటిదికాదు । కేవలంఅపవిత్రవస్తువు । మూత్రపురీషాలకంటేతక్కువ ।
గు॥ మగవాడు ముందరవున్నట్టూ । కండ్లుసుత్తి చూడంగానే । పుట్టనిచావనిది । రాకడ పోకడలేనిది । సకలదేశాలయందు । సార్వకాలాలయందు । సమస్తమైన వస్తువులయందు । చలించక తనకుతానే ।స్వతశిద్ధమైవున్నది । దానికిపేరులేదు ఆకారంలేదు । శరీరంకొట్టుబడ్డాఆపుట్టనిచావనిదికొట్టుబడదు ।

శ్లో॥ నజాయతేమ్రియతేవాకదాచి । న్నాయంభూత్వాభవితావానభూయః ।
అజోనిత్య శ్శాశ్వతో ఉయంపురాణో । నహన్యతేహన్యమానేశరీరే॥

తా॥ ఈకేవలాత్మ ఒకప్పుడుపుట్టదు. ఒకప్పుడుచావదు. ఒకప్పుడుండి మరలమరి యొకప్పుడు ఉండనిదియుగాదు. మునుపులేక వెనుకవచ్చినదియునుగాదు. ఎందువల్లననగా నిదిపుట్టుకలేనిది, మరణములేనిది, ఎల్లప్పుడుఉండునది, అనాది యైనది. శరీరములుహతమైనను ఈకేవలాత్మహతముకాదు.

శి॥ యదార్థంగావున్నది । నాకుచాలు । కొనకూ వాక్యందయచెయ్యండి ।
గు॥ "మూలంలేనియీగుత్తేరిగేశరీరంయేమీలేదు" । మూలంలేనియీగుత్తేరిగే శరీరం కలల్లోయేనుగమేలుకొంటే । యేలాగోఆలాగే । మూలంలేనియీగుర్తె రిగేశరీరం యేనుగ । మూలంలేని యీగుత్తేరిగే శరీరం యేమీలేకుంటే । యేలాగువున్నదో అలాగే । సార్వకాలం అదే । పరిపూర్ణం । గనుక । యిది భ్రాంతిలేని రాజమార్గం ।

—( ఇతి శ్రీమద్గురు శివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే, )—

* సాందీప శ్రీకృష్ణ సంవాదే *

( న వ విం శ తి ప్ర క ర ణం )

*కందార్థము.*

(30)* తానేననకనునిండిన * దానికిపేరేమిబయలు * తానేననుచుం నేననియదనే నెవ్వరు * లేనెరుకవు వుంటివుంటే * లేనేలేననుమీ * అంటేనిలంటే లేనేలేవుసుమీ* లేనేలేనని నేను లేకపోయిన వెనక * తానుండునదవుంటే * దాన్నెట్లెరిగెదవీవు * లేనే లేననుమీ * అంటివిలంటె * లేనే లేవుసుమీ॥ * * * *

* శ్రీ శివరామదీక్షితీయమనుబృహద్వాశిష్ఠం. *
( అచలబోధసిద్ధాంతం. )

గు॥ యీకలలోనే వక్కమనిషివచ్చి। వచ్చి। పుట్టని చావనిది। మొదలుకొనా లేనిది। రాకడపోకడలేనిది। సకలదేశాలయందు। సార్వకాలాలయందు। సమస్తమైనవస్తువులయందు। చెలించక తనకుతానే। స్వతశిద్ధమైవున్నది।

శి॥ అందుకు అనుమానంలేదుగాని। నేనుయేమీఅని। అనుకుంఛా।

గు॥ యీమూలంలేని। యీగుర్రెగేశరీరమే। నీవు।

శి॥ అదే। నాకుమూలంలేదా।

గు॥ నీకు యేమీమూలంలేదు। కొనకు ప్రవేశించేటందుకు స్తానంయేమీలేదు।

శి॥ నాబ్రతుకుయేమీ।

గు॥ కేవలభ్రాంతిమాత్రమేకాని। రెండోది యేమీలేదు। యీకలలో యేనుగ వచ్చింది। యినుపగొలుసులతోటి కట్టివేశినాము। నూరు చెరుకు మోపులు వేస్తే తినుకుంఛూవున్నాది। యిదియెక్కడినుంచివచ్చినది।దీనికీమూలంయేమి యెవ్వరునిర్మాణంచేశినారు। యెవ్వరిసత్తాచాతవున్నది। కొనకు యెవ్వరివలన లయమవుచుంది।

శి॥ నాకుయింత తెలియదు।

గు॥ యీయేనుగకూ మొదలుయేమీలేదు। వున్నప్పుడూ మొదలు యేమీలేదు। యెప్పుడువిచారిస్తే। అప్పుడేయేమీలేదు। వున్నది తనకు తానే। స్వతశిద్ధమై వున్నది। దానికీ రాకడాలేదు। పోకడాలేదు। అందుకే అచలం। ఆయేనుగ వంటిదే। మూలంలేని యీగుర్రెగేశరీరం। సార్వకాలం అచలమే। మేలుకొంటే ఆయేనుగ। తనకుతానే। యేమీలేదని। దృఢంయీలాగో ఆలాగే।

మూలంలేని యీగుత్తెరిగేశరీరం యేమీలేదని। దృష్టాం। గురు కృపచాత ఆయునా। వ్యవహారానికి। మూలంయేమీ। వున్నదిఅన। వ్యవహారం విడిచేటందుకు। మూలంయేమీ వున్నదనివిడువ। యీలాగుమనసు। వోస్తేఆలాగు। యేమిటిచాతనడువ। సార్వకాలం వొక్కతీరే। విచారానకు ఫలం। అందుకే పుట్టనిచావనిది। మొదలుకొనాలేనిది। రాకడా పోకడాలేనిది। సకల దేశాలయందు। సార్వకాలాలయందు। సమస్తమైనవస్తువులయందు। చలించకుండా। స్వతశిద్ధమైవున్నది।అనిచెప్పిచూపి।తానుపాయి।వున్నదివొక్కతీరుగానే।వున్నది పోయిందానిజాడా యేమీలేదు।యిన్నిప్రకారాల। మూలంవున్నదనేటందుకు తోచదు। అనిభంగపడేమాత్రమే। శరీరంలేనిదానికి। వ్యవహారంవున్నదిఅని। యెవ్వరుఅన। లేదనియెవ్వరుఅన। యేమీలేదనియెవ్వరుఅన।అందరూశరీరంలేనివారే। శరీరంలేనిదివున్నది। విచారించవలె। శరీరానకుమూలంవుండెనా।వ్యవహారంసిబద్ధే। శరీరానకుమూలంలేకపాయనా। వ్యవహారంయేమీలేదు।శరీరం లేదుగనక। అందుకే। "మూలంలేని యీగుత్తెరిగేశరీరం యేమీలేదు" అని గురువాక్యం। మొదలుయేమీలేదుగనక। వున్నా యేమీలేదు। "అయమచలః, కదాచిత్ నజాయతే, నమ్రియతేచ, శరీరంనభూత్వా। అభవితావానభూయః। నభూత్వాతస్మాత్। అజః, నిత్యః, శాశ్వతః। అయమచలః।పూర్వాశాద। శరీరేహన్యమానేసతి। అయమచలః। నహన్యతే। యేనమచలం। నహంతారయః। మనన్యతే। ఏనమచలం।హారమితియః। మనన్యతే। తాఉభౌ।నవిజానీతః। అయమచలః। నహంతి। నహన్యతే॥

* శ్రీ భగవద్గీతా *

శ్లో॥ వేదావినాశినంనిత్యం। యఏనమజమవ్యయం।
కథంసపురుషఃపార్థ। కంఘాతయతిహంతికం॥

తా॥ ఓఅర్జునా? ఎవడీకేవలాత్మ నాశములేనిదనియు, నిత్యమనియు, పుట్టుకలేనిదనియు, క్షయములేనిదనియు తెలియబడుచున్నాడో, అట్టిపురుషుడు ఎట్లు ఎవనిచేత

వధింపబడును ఎట్లు ఎవనినివధించును అట్టివాడు తానువధింపబడుటయు, దాని తరుల వధించుటయు నసంభవము.

అందుకే క్రియాసూన్యమైనది । అచలం । గనక । యంతవాండ్లకూ । కఠినంవలె వున్నది । శరీరమనే చంచలంచాత । శరీరం యేమీలేదని । స్మారకం వచ్చెనా । సార్వకాలంఅచలమే ( ఉదకాగ్ని నాచుకప్పినట్టేకప్పినది. ) యింతేకాని । యింత కంటేలసుభంలేదు । గురుసాంప్రదాయం । శరీరంలేనిసాంప్రదాయం కావలే । కాకపాయనా । శరీరంకంటే నరకం వేరేలేదు ।సమస్తమైనా । భ్రమలకూశరీర మేమూలం । శరీరంలేకుంటె । వొక్కటైనా భ్రాంతివుండదు । శరీరంవలనపుట్టిన వేలన్ని । శరీరంవలనసచ్చిదానందంపుట్టింది । సచ్చిదానందంవలనశరీరంపుట్టింది సచ్చిదానందమే।అనాత్మ।ఆత్మసచ్చిదానందమే।పరబ్రహ్మంసచ్చిదానందమే । పుట్టినశరీరము లెల్లా సచ్చిదానందమే।గుతేఁరిగేదెల్లాసచ్చిదానందమే।పుట్టని చావనిది । మొదలుకొనాలేనిది । రాకడపోకడలేనిది సకలదేశాలయందు।సార్వ కాలాలయందు । సమస్తమైన వస్తువులయందు। చలించకతనకుతానే స్వతశిద్ధమై వున్నది । చూడదు । వినదు । గుర్తెరుగదు । వొక్కటైనావికారంలేదుగనక । రెండోదానికి మూలంయేమీలేదు । విచారించని వారికీ । విచారించని వారే మూలం । గురు మూలంగా । విచారించినవారికీ । సార్వకాలంఅచలమే । చెలిం చేశరీరానకు । మూలంయేమీలేదుగనక । మూలంలేని యీగుర్తెరిగే శరీరానకూ । మూలం యేమీలేదుఅని । రాద్ధాంతమే । రాద్ధాంతం । శిద్ధాంతమే । శిద్ధాంతం । అందుకేసార్వకాలంవక్కటిసే । శరీరంలేకుంటే । క్రియాసూన్యమే శరీరంవున్నదని అనుకొనిరా । అందరివంటి మూఢులే । అందరివంటి జ్ఞానులే । శరీరంలేనివారు యెవ్వరో । వారేవిచారపరులు । వారేచలించనివారు । వారే। భ్రాంతిలేనివారు । వారివంటివారువారే ।

శి॥ సరే । సరే । చాలు ।

—( ఇతి శ్రీమద్గురు శివరామదీక్షిత ప్రభావే వేదాంతవిచారణే,)—

* పాండిత శ్రీకృష్ణ సంవాదే త్రింశతి ప్రకరణం *



* కందార్థము *

(౩౧) * మీరాజ్ఞ యిచ్చివుంటిరి * నేరుపుతో బయలునెరుక నెరిగించిపరంగ *, పేర ణతుయొసకననయి * ట్లారీతినయొసక పరచుమయ్యాప్రమొక్కేనూ * అనుమానాము * జెయ్యాకియ్యెడనూ * సారేకుమీపాద జలజయుగ్మమునాహృ * త్సారాసమునవిల్పి సల్పాచుపూజానో * యయ్యాప్రమొక్కేనూ * అనుమానాము జెయ్యాకియ్యెడనూ॥

* శ్రీ శి వ రా మ దీ క్షి తీ య మ ను బృ హ ద్వా శి ష్టం *
( అ చ ల బో ధ సి ద్ధాం తం )

గు॥ యీకలలోనే జెనకజమహరాజువొచ్చె। వచ్చీపుట్టనిచావనిది। మొదలుకొనాలే నిది। రాకడ పోకడలేనిది। సకలదేశాలయందు। సార్వకాలాలయందు। సమస్తమైనావొస్తువులయందు। చలించక తనకుతానే। శరీరంలేక స్వతశిద్ధమైవుంన్నది। మీరుచూడండ్రి। నావిచారంయిషువంట్టిది। నేనుయెప్పుడూ వొక్కతీరుగానేవున్నాయిది మాసాంప్రదాయం। వున్నదివుంన్నట్టెవున్నది। లేనిదియేమీలేదు।

శి॥ చాలు। సరే। సరే। రాజ్యంయెవ్వరుచేశినారో।

గు॥ శాబాస్।

* ఇతి శ్రీమద్గురు శివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణె *
( జనకశుక సంవాదే యేకోనత్రింశతి ప్రకరణం )





# గురుపూజావిధానము.

శ్రీమత్పరశురామ సీతారామ స్వగురు పరబ్రహ్మణేనమః

శ్రీమద్భాగవతకృష్ణదేశిక ప్రభువరులు.

శ్రీమత్పరశురామ సీతారామ స్వామివారికి చేసిన

* శ్రీనిజగురుపూజావిధానం. *

శ్లో॥ శ్రీమత్పరశురామాన్వయాబ్ధిచంద్రమనోరమం।
నిత్యానందమహంవందేసీతారామగురుంపరం ॥

శ్లో॥ హృత్పుండరీకమధ్యస్థం। సకలామ్నాయసంస్తుతం।
ధ్యాయామ్యహంసదాభక్త్యా। సకలాభీష్టదాయకం ॥౧॥

శ్రీమత్పరశురామసీతారామ స్వగురు పరమగురు పరమేష్టిగురు సద్గురు
జగద్గురు నిజగురు పరబ్రహ్మణేనమః॥ధ్యాయామి॥౧॥

ధ్యానంసమర్పయామి.

శ్లో॥ ఆగచ్ఛానంతదేవేశ। భోగమోక్షప్రదాయక।
నాకేశముఖలోకేశ। వందితాంఘ్రిద్వయాంబుజ॥ ౨॥

శ్రీమ*ఆవాహనం సమర్పయామి.

శ్లో॥ రత్నసింహాసనంవందే। సంగృహాణసమర్పితం।
చంద్రమండలసంకాశ। సంస్మితాననపంకజ॥౩॥

శ్రీమ*అనేక మణిమయరత్న ఖచిత సింహాసనం సమర్పయామి.

శ్లో॥ పాద్యంగృహాణభోస్వామిన్। మయానీతంశుభప్రదం।
కృష్ణవేణీజలంభక్త్యా। తీర్థపాదజగద్గురో॥౪॥

శ్రీమ* పాదయోః* పాద్యం* సమర్పయామి॰

శ్లో॥ అర్ఘ్యందాస్యామ్యహంభక్త్యా । తవపాణితలేవిభో ।
గోదావరీజలంహేమ । కలశస్థంసువాశితం॥౫॥

శ్రీమ* హస్తయోః* అర్ఘ్యం* సమర్పయామి॰

శ్లో॥ ఆచమ్యతాంమయాదత్తం । హేంగురోయమునాజలం ।
త్వదర్థంకృపయాభావ । భవబాధనికృంత్తనా॥౬॥

శ్రీమ* ముఖే* ఆచమనీయం* సమర్పయామి॰

శ్లో॥ శర్కరాదధిమధ్వాజ్య । క్షీరమిశ్రమిదంవిభో ।
పంచామృతంమయాదత్తం । స్నానంకురుజగత్పతే॥౭॥

శ్రీమ* పంచామృత స్నానం* సమర్పయామి॰

శ్లో॥ తప్తకాంచనకుంభస్థం । కించిదుష్ణంసువాశితం ।
మయానీతంజాహ్నుకన్యా । జలస్నానంకురుప్రభో॥౮॥

శ్రీమ* శుద్ధోదకస్నానం* సమర్పయామి॰

శ్లో॥ వస్త్రయుగ్మంమయాదత్తం । త్వదర్థంస్వర్ణతంతున ।
నిర్మితంనిర్మలంస్వామిన్ । నిత్యకల్యాణపావనా॥౯॥

శ్రీమ* అలంకరణార్థం* వస్త్రయుగ్మం* సమర్పయామి॰

శ్లో॥ కార్పాసతంతునాశుభ్రం । రచితంతేర్పితంమయా ।
సంగృహాణమిదంయజ్ఞ । సూత్రంపాత్రందయానిధే॥౧౦॥

శ్రీమ*యజ్ఞోపవీతం*సమర్పయామి.

శ్లో॥ కిరీట కుండలంరత్న। కంకణాదిని తేమయ।
సంగృహ్యతాంభూషణాని। అర్పితానినిరంజన॥౧౧॥

శ్రీమ*సర్వాభరణభూషణాన్ *సమర్పయామి.

శ్లో॥ మలయాచలసంభూతం। కర్పూరకలితంవిభో।
విలేపనంత్వదర్థంభో। గృహ్యతామర్పితంమయా॥౧౨॥

శ్రీమ*గంధం * సమర్పయామి.

శ్లో॥ తండులాన్ ధవళాకారాన్ । హరిద్రాచూర్ణమిశ్రితాం।
గృహ్యతామక్షతాన్ దేవ। మయాదత్తాన్మనోహరాన్॥౧౩॥

శ్రీమ*అక్షతాం*సమర్పయామి.

శ్లో॥ పుష్పాణ్యనేకానిసుపల్లవాని। సుగంధయుక్తానిమనోహరాణి।
త్వాంగృహ్యతాందేవమయార్పితాని। జలాశయస్థానిజపాదికాని॥౧౪॥

శ్రీమ*నానావిధపరిమళపత్రపుష్పం*సమర్పయామి.

* అ థ అం గ పూ జ. *

౧ తీర్థపాదాయనమః * పాదౌ*పూజయామి
౨ నిగమమంజీరాయనమః * గుల్ఫౌ*పూజయామి
౩ స్మరతూణీరజంఘాయనమః * జంఘౌ*పూజయామి
౪ ముక్తికాంతాశేవితాయనమః * జానునీ*పూజయామి
౫ రత్నస్తంభోరుయుగళాయనమః * ఊరూ*పూజయామి

౬ పులినతలజఘనాయనమః * జఘనే * పూజయామి
౭ మణికాంచితకలాపశోభితాయనమః * కటిం * పూజయామి
౮ గంభీరనాభీమండలాయనమః * నాభిం * పూజయామి
౯ విశ్వోదరాయనమః * ఉదరం * పూజయామి
౧౦ దయార్ద్రహృదయాయనమః * హృదయం * పూజయామి
౧౧ విశాలవక్షాయనమః * వక్షస్థలం * పూజయామి
౧౨ కంబుగ్రీవాయనమః * కంఠం * పూజయామి
౧౩ వరదానధురీణాయనమః * హస్తౌ * పూజయామి
౧౪ ఉన్నతస్కంధాయనమః * భుజౌ * పూజయామి
౧౫ స్మితవక్త్రాయనమః * వక్త్రం * పూజయామి
౧౬ చంపకనాసాయనమః * నాశికం * పూజయామి
౧౭ పల్లవాధరాయనమః * అధరం * పూజయామి
౧౮ పుండ్రేక్షుకార్ముకభ్రువేనమః * భ్రూయుగ్మం * పూజయామి
౧౯ కరుణాకటాక్షవీక్షణాయనమః * నేత్రౌ * పూజయామి
౨౦ పుష్టకర్ణాయనమః * కర్ణౌ * పూజయామి
౨౧ రాకాసుధాంశువదనాయనమః * ముఖం * పూజయామి
౨౨ సులలాటాయనమః * లలాటం * పూజయామి
౨౩ నీలకుంచితమూర్ధజాయనమః * కేశాన్ * పూజయామి
౨౪ సువృత్తశిరసాయనమః * శిరః * పూజయామి
౨౫ సర్వాత్మనేనమః * సర్వాంగాని * పూజయామి

* అథ పత్ర పూజా *

౧ అచింత్యాయనమః * బిల్వపత్రం * సమర్పయామి
౨ బృందారకవందితాయనమః * తులసీదళం * సమర్పయామి
౩ భువనరక్షణతత్పరాయనమః * వకుళపుష్పం * సమర్పయామి
౪ భూతిదవిభవాయనమః * పున్నాగపుష్పం * సమర్పయామి
౫ జగజ్జననకారణాయనమః * కేతకీపత్రం * సమర్పయామి

౬ చరాచరగురవేనమః * చామంతికాపుష్పం * సమర్పయామి
౭ సుప్రభావాయనమః * చంపకపుష్పం * సమర్పయామి
౮ సుప్రసన్నాయనమః * పాటలీపుష్పం * సమర్పయామి
౯ అపవర్గప్రదాయనమః * శతపత్రపుష్పం * సమర్పయామి
౧౦ అనంతాయనమః * జాజిపుష్పం * సమర్పయామి
౧౧ మోహావర్జితాయనమః * కరవీరపుష్పం * సమర్పయామి
౧౨ ముకుందాయనమః * రసాలపుష్పం * సమర్పయామి
౧౩ ప్రకృతిపురుషవిలక్షణాయనమః * మాలతీపుష్పం * సమర్పయామి
౧౪ నిత్యాయైనమః * కల్హారపుష్పం * సమర్పయామి
౧౫ ఆజ్ఞేయచక్రనిలయాయైనమః * అతశీపుష్పం * సమర్పయామి
౧౬ నాదబిందుకళాతీతాయనమః * పారిజాతపుష్పం * సమర్పయామి
౧౭ భూతాత్మనేనమః * అశోకపుష్పం * సమర్పయామి
౧౮ మండలత్రయాతీతాయనమః * నీలోత్పలపుష్పం * సమర్పయామి
౧౯ అనంతాయనమః * మల్లికాపుష్పం * సమర్పయామి
౨౦ అవ్యక్తాయనమః * మాలతీపుష్పం * సమర్పయామి

౧౦౮ * అథ అష్టోత్తరశతనామాని *

౧ సద్గురవేనమః
౨ పూర్ణాయనమః
౩ సర్వాధారాయనమః
౪ స్వచ్ఛాయనమః
౫ శుద్ధాయనమః
౬ నిర్మలాయనమః
౭ విశ్వోదరాయనమః
౮ నిరాలంబాయనమః
౯ రమ్యాయనమః
౧౦ నిర్లేపాయనమః
౧౧ సర్వాసనాయనమః
౧౨ నిగ్రంథాయనమః
౧౩ స్వప్రకాశాయనమః
౧౪ నిత్యతృప్తాయనమః
౧౫ అనంతాయనమః
౧౬ అద్వితీయాయనమః
౧౭ వేదవాచామవేద్యాయనమః
౧౮ పరంజ్యోతిషేనమః
౧౯ ప్రణవాతీతాయనమః
౨౦ అచలాయనమః
౨౧ అపరిమితాయనమః
౨౨ అప్రమేయాయనమః

౨౩ అవ్యయాయనమః
౨౪ అచ్యుతాయనమః
౨౫ అహంకారవివర్జితాయ నమః
౨౬ విశ్వాత్మనేనమః
౨౭ ప్రపంచాతీతాయనమః
౨౮ మానసీయాయనమః
౨౯ క్షరాక్షరవిలక్షణాయనమః
౩౦ దృగ్దృశ్యాతీతాయనమః
౩౧ ద్వైతాద్వైతవినిర్ముక్తాయనమః
౩౨ అఖండాయనమః
౩౩ ఖండాఖండవిరహితాయనమః
౩౪ ఆదిమధ్యాంత శూన్యాయనమః
౩౫ నిరంజనాయనమః
౩౬ నిర్వికల్పాయనమః
౩౭ నిరాకారాయనమః
౩౮ నిరాఖ్యాతాయనమః
౩౯ పరమానందస్వరూపాయనమః
౪౦ సగుణనిర్గుణాతీతాయనమః
౪౧ సర్వసాక్షిణేనమః
౪౨ సాక్ష్యతీతాయనమః
౪౩ త్రిగుణాతీతాయనమః
౪౪ సర్వభూతాంతరస్థాయనమః
౪౫ సుఖదుఃఖవిరహితాయనమః
౪౬ జన్మజరామరణవర్జితాయనమః
౪౭ క్షేత్రజ్ఞాయనమః
౪౮ సర్వోపశమతాపత్రాయనమః
౪౯ నిష్కళంకాయనమః
౫౦ నిరాభాసాయనమః
౫౧ స్వప్రకాశాయనమః
౫౨ సృష్టిస్థిత్యంతకారణాయనమః
౫౩ కర్తృత్వరహితాయనమః
౫౪ సచ్చిదానందాతీతాయనమః
౫౫ అపరోక్షాయనమః
౫౬ సకలమంత్రస్వరూపాయనమః
౫౭ ఆకాశతనవేనమః
౫౮ నిరాధారాయనమః
౫౯ నిస్తేజసేనమః
౬౦ అవికారాయనమః
౬౧ అమలాయనమః
౬౨ పరతత్త్వాయనమః
౬౩ పరంధామ్నేనమః
౬౪ అజాయనమః
౬౫ అగమ్యాయనమః
౬౬ షడ్గుణైశ్వర్యసంపన్నాయనమః
౬౭ సనాతనాయనమః
౬౮ త్రిమూర్త్యాత్మనేనమః
౬౯ అనాద్యంతాయనమః
౭౦ సర్వోపాధివినిర్ముక్తాయనమః
౭౧ భక్తాభీష్టఫలప్రదాయనమః
౭౨ భవరోగభేషద్యాయనమః
౭౩ సహస్రారచక్రమధ్యస్థాయనమః
౭౪ సనకాదిమునివందితాయనమః
౭౫ కామక్రోధాదిశత్రునికృంతనాయ నమః
౭౬ కరుణారసార్ద్రహృదయాయన మః
౭౭ బ్రహ్మవిష్ణుమహేశ్వరస్తుతాయ నమః
౭౮ బ్రహ్మాండజనకాయనమః
౭౯ పరమపావనాయనమః

౮౦ దీనజనానుగ్రహాయనమః
౮౧ దివ్యపురుషాయనమః
౮౨ ప్రసన్నపారిజాతాయనమః
౮౩ పురాణపురుషాయనమః
౮౪ నిరుపద్రవాయనమః
౮౫ నిత్యకల్యాణాయనమః
౮౬ సర్వోపనిషత్పంజరకీరాయనమః
౮౭ శబ్దాతీతాయనమః
౮౮ జగన్నాధాయనమః
౮౯ జగద్గురువేనమః
౯౦ విష్ణువేనమః
౯౧ సర్వతోభద్రాయనమః
౯౨ నిగమార్థప్రతిపాదకాయనమః
౯౩ నిస్సంగాయనమః
౯౪ సహజానందాయనమః
౯౫ చిన్మయాయనమః
౯౬ శ్రీమతేనమః
౯౭ సహజామనస్కాయనమః
౯౮ సాయుజ్యప్రదాయనమః
౯౯ పంచబ్రహ్మమయాయనమః
౧౦౦ అజడాయనమః
౧౦౧ జడాజడవిలక్షణాయనమః
౧౦౨ భావాభావమధ్యస్థాయనమః
౧౦౩ అమనస్కాయనమః
౧౦౪ అఖిలాండకోటిబ్రహ్మాండనాయకాయనమః
౧౦౫ సర్వాదయేనమః
౧౦౬ పరాత్పరాయనమః
౧౦౭ లక్ష్యాతీతాయనమః
౧౦౮ మనోవాగగోచరాయనమః

నానావిధపరిమళపత్రపుష్పాణి సమర్పయామి॰

శ్లో॥ చందనాగరుకర్పూర । శర్కరాద్యసమన్వితం ।
ధూపోయంగృహ్యతాంస్వామిన్ । త్వమిదం తేమయార్పితం॥౧౫॥

శ్రీమ*ధూపమాఘ్రాపయామి॥

శ్లో॥ వహ్నినాయోజితంసాద్యం । దీపంవర్తిత్రయాన్వితం ।
గృహాణజ్ఞానతిమిర । హరజ్ఞానప్రవర్ధనం॥౧౬॥

శ్రీమ॥ దీపందర్శయామి॥

శ్లో॥ శాల్యన్నషడ్రసోపేతం । పంచభక్ష్యాదిసంయుతం ।
నైవేద్యందేవదత్తాజ్య । సమిశ్రంప్రతిగృహ్యతాం॥౧౭॥

శ్రీమ*మహానైవేద్యంసమర్పయామి॥

శ్లో॥ పానీయ్యంశీతలంస్వచ్ఛం । మధ్యేమధ్యేమయార్పితం।
సుగంధయుక్తంమధురం । పిబ-త్వంపురుషోత్తమ॥
శ్రీమ*మధ్యేమధ్యేవుదకపానియంసమర్పయామి॥౧౮॥

శ్లో॥ సుపక్వాన్యనేకాని । రంభాంమ్రజంబూసఖర్జూర ।
నారంగద్రాక్షాదికాని త్వమేతానిసంగృహ్యతాం స్వప్రకాశ ఫలాని
ప్రదేయానిసర్వాణి తేజ్య॥౧౯॥

ఫలోపహారనైవేద్యం సమర్పయామి॥

శ్లో॥ తాంబూలంగృహ్యతాంపూగి । ఫలకర్పూరసంయుతం ।
నాగవల్లీదళాద్యంతం । గురోతుభ్యోమయార్పితం॥౨౦॥

శ్రీమ*తాంబూలం సమర్పయామి॥

శ్లో॥ సువర్ణోదరగర్భస్త్వం । స్వర్ణబీజంమయార్పితం ।
అనంతపుణ్యదంస్వామిన్ । తేగృహాణాత్వమచ్యుతం॥౨౧॥

సువర్ణపుష్పదక్షిణాం సమర్పయామి॥

శ్లో॥ నీరాజనంమయాదత్తం * రాజరాజేశపూజితం ।
గృహాణజగదుత్పత్తి । హేతుభూతాఘనాశన॥ ౨౨॥

శ్రీమ*మంగళనీరాజనం సమర్పయామి॥

శ్లో॥ సుకేతకీపాటలపారిజాత । చాంపేయకంజాతరసాలమల్లికా ।
చామంతికాసంయుతమంత్రపుష్పం । గృహ్ణామివిష్ణో శివశంకరాచ్యుత॥
శ్రీ॥మ*దివ్యసువర్ణమంత్రపుష్పం సమర్పయామి॥

శ్లో॥ జన్మాంతరకృతాంన్యాని । యానిపాపానిమేప్రభో ।
నశ్యంతు తేతానితాని । ప్రదక్షిణపదేపదే॥౨౪॥

శ్రీమ*ఆత్మప్రదక్షిణనమస్కారాన్ సమర్పయామి॥

శ్లో॥ యస్యస్మృత్యా చ నామోక్త్యా । తపఃపూజాక్రియాదిషు ।
న్యూనం సంపూర్ణతాం యాతి । సద్యో వందే తమచ్యుతం॥౨౫॥

శ్లో॥ మంత్రహీనం క్రియాహీనం । భక్తిహీనం జనార్దన ।
యత్పూజితం మయా దేవ । పరిపూర్ణం తదస్తు మే॥ ౨౬॥

శ్లో॥ అజ్ఞానమూలహరణం । జన్మకర్మనివారణం ।
జ్ఞానవైరాగ్యసిద్ధ్యర్థం । గురుపాదోదకం పిబేత్॥౨౭॥

శ్లో॥ గురుపాదోద్ధితం తీర్థం । పీత్వాత్రిపుటినాశనం ।
సర్వద్వంద్వవినాశంచ । విద్యతే న పునర్భవం॥౨౮॥

శ్లో॥ గచ్ఛాద్య పునరాగచ్ఛ । మామకాభీష్టసిద్ధయే ।
గురోర్యః కృపయావీక్ష్య । పూజాస్వీకురు మత్కృతం॥౨౯॥

శ్లో॥ భాగవతఃకృష్ణభూసురరచితమిదం । దేసికస్యపూజార్థం పూజావిధా
నంశమతులం । వక్త్యశ్రోత్రద్వయోర్మోక్షకరం॥౩౦॥

* ఇతి శ్రీమద్భాగవతకృష్ణవిరచిత గురుపూజావిధానం సమాప్తః *

* మంగళహారతి *

పల్లవి

మంగాళము యనరే । శ్రీమద్గురు । పుంగావుగనుగొనరే ।

అనుపల్లవి

శృంగారవతులారశిగ్గేలతాళ । మృదంగాదిసద్వాద్యధ్వనులూచలంగాగ । మం॥

చరణములు

యిదియాదిమంత్రామనీ తెలిపితెలిపి । యిదిరెండో మంత్రామనీ । పదిరెండక్షరమూలు పాఠాము జేయించి పదియారక్షరమూలు పఠనాజేయించూను ॥మం॥ శరణన్నామాత్రాముని । నభయంబిచ్చి । నైజేచ్ఛ రమండు నా । అరమార లేకానుపరిపూర్ణమును జూపి । యరుకాలేదని తెలిపించును కానువదలించూచ్చు ॥మం॥౩॥ దృష్టాంతమియరుకకూ స్వప్నంబాని ద్రాక్షోనంతమిబోధకూ । శ్రేష్ఠామాకరూపర శిక్షసి యోగంబానీ । స్వష్టాముగాదెల్పి సమరాసపుచ్చూను ॥మం॥౪॥ వరభాగవతకృష్ణూసి । హృత్కమలబంభరుడై వెలయునతనీ । మరుగూజొచ్చినవారుమరలిపుట్టరుపిరే । పరశురామునివంశోద్భవశీతారాములకూ॥మం॥౫॥ * * * *

### * మం గ ళ హా ర తి. *

పల్లవి

గురునకుమంగళమనరమ్మా *మ* ద్గురుమూర్తికినిగనుగొనరమ్మా||

అ ను ప ల్ల వి.

తరుణులారయీతనికిభక్తితో మురయుచుప్రమొక్కిన మోక్షముచేకురు||౧||

చరణములు

క్షరపురుషుండనరాదమ్మా*అ*క్షరపురుషుండనగాదమ్మా * క్షరపురుషాక్షరపురుషుల కావలి*పురుషోత్తముడనబరగినమాయీ||౨|| క్షేత్రజ్ఞుండన రాదమ్మా*యీ* క్షేత్రమ తండనగాదమ్మా* క్షేత్రజ్ఞునితక్షేత్రంబును యే*మాత్రముదగులకపాత్రుడైనయీ|| గు ౩ స్మరణరూపుడనరాదమ్మా*వి*స్మరణరూపుడనగాదమ్మా*స్మరణలేకవిస్మరణగాకత స్మరణవిస్మరణలేరుక లేనీయీ|| గు || ౪ || దేహి యనుటకనరాదమ్మా*యీ*దేహమ తండనగాదమ్మా*అహం భావనకట్టుపొట్టులగు దేహిదేహముల తెరుపుబోనియీ||గు|| ||౫ ||పిండరూపుడనరాదమ్మా*బ్ర*హ్మాండరూపుడనగాదమ్మా*పిండాండబ్రహ్మాం డభాండముల*నిండియుండియవిరెంపుగానియీ|| గు || ౬ ||జ్ఞానియనుటకనరాదమ్మా* అ*జ్ఞానియనుటకదిలేదమ్మా*జ్ఞానాజ్ఞానములోననొక్కటియు* తానుగాకశూన్యానికి మీరిన|| గు || ౭ || యోగియనుటకనరాదమ్మా * మరి*భోగియనుటకనగాదమ్మా* యోగిభోగివ్రుద్యోగములంట్టని*భాగవతాన్వయభవకృష్ణుండనే|| గు || ౮ || మేలుకీడులన రాదమ్మా*యే మేలుకీడులదిగాదమ్మా*కాలకూటమునకంన్నమిక్కిలగు *జాలమాం బవెతశుణములో బాపిన|| గు || ౯ ||

### * మంగళహారతి *

చరణములు

మామకగురునకుమంగళంబ్రహ్మాండనగరునకుమంగళం|| ప || మానరహితునకుమం గళం అ సమానచరితునకుమంగళం|| ౧ || ద్వంద్వశూలునకుమంగళంనిర్ద్వంద్వఖేలు నకు మంగళం || ౨ || శూన్యశూన్యునకు మంగళం బహుమాన్య మాన్యునకు మంగళం ||౩ || శబ్దలోపునకు మంగళం ని శ్శబ్దరూపునకు మంగళం || ౪ || భేదముక్తునకుమంగళం ని ర్భేదరక్తునకు మంగళం || ౫ || త్రిపుటిదూరునకు మంగళం ని త్రిపుటిసారునకు మం ళం || ౬ || బుధ్యతీతునకు మంగళం ని ర్బుధ్యుపేతునకు మంగళం|| ౭ || గళితతాపునకు మంగళం ని ర్గళితపాపునకు మంగళం || ౮ || గోప్యగోప్యునకు మంగళం అ ప్రాప్య ప్రాప్యునకు మంగళం || ౯ || దేవశేష్యునకు మంగళం ని ర్భావభావ్యునకు మగళం||౧౦|| దీనభరణునకు మంగళం అభి మానహరణునకు మంగళం || ౧౧ || కృష్ణనామునకు మం గళం దు ష్టృష్ణభీమునకు మంగళం || ౧౨ || జాలమేశునకు మంగళం స్మృతిజాలనాశు నకు మంగళం|| ౧౩||మామకగురునకు మంగళం బ్రహ్మాండ నగరునకు మంగళం || ౧౪ ||

* మంగళహారతి *

పల్లవి

మామక గురుమూర్తికి వరమంగళారతీ

అనుపల్లవి

వచ్చితామరసదళాక్షులారతాళభరతగీతములను ॥ మా ॥ ౧ ॥

చరణములు

తారకసాంఖ్యామనస్క తతినివిచ్చి చెప్పివీటి మీరియుని కెయోగములకు మేటి యోగమనుచు దెల్పు॥మా॥ ౨ ॥ అఖిలమహావాక్యసమితియందు గలయహంపదమును నఖముఖమునమీటి వేశినట్టిజగద్ఘటియైన ॥ మా ॥ ౩ ॥ యంచ్చుమించ్చు లెంచకుము ప్రపంచ్చమంత్ర బ్రాహ్మమని వచించ్చిసంశయముల నెల్లద్రుంచి పారవైచునట్టి॥మా ॥ ౪ ॥ అహామె నీవునేనుజగములఖిలనామరూపములగు నహాము లేనివస్తువేదో యదియెనిజమటంచ్చుబల్కు ॥ మా॥ ౫ ॥ జాలమాంబికయనుమాచ్చిచా ననంమ్మికొలచియిట్టి కీలుదెలశెభాగవతులకృష్ణయోగిచాతనట్టి ॥ మా ॥ ౬ ॥

* మంగళహారతి *

పల్లవి

శృంగారా వతులారా మీరూమంగాళామనరే

అనుపల్లవి

మద్గురుపుంగావునకూవీణాతాళమృదంగాదీవాద్యధ్వనులాత్తో ॥ శృ ॥ ౧ ॥

చరణములు

బంగారుపళ్లేరములోనరంగైనజ్యోతూలైదునిచి పొంగూచుచేపట్టినోటసంగీతాములుల్లాశిల్లా ॥ శృ॥ ౨ ॥ స్రష్టాదిదేవతలాకితడాధిష్టావమితగానికరుణ దృష్టితుష్టినొందామనకాభీష్టాసంప్రాపదనోసగీని ॥ శృ ॥ ౩ ॥శంప్పాలతనూబోలుతుచ్చా సంప్పాదమునకేలమోక్షసంప్పాదానియననూగూచ్చి సంప్పాదింత్తామూవేవేగ॥ శృ ॥ ౪ ॥ ఆగామానిగమాదివిద్యలరశీ కన్గోనా లేనట్టిభాగావతకృష్ణాభిధాన బ్రాహ్మమితడీతనికివేగ ॥ శృ ॥ ౫ ॥ తల్లావర్ఘులాజాలామయుల్లామందితగాని చరణపల్లావములగొలచిముక్తీకొల్లలాడా సాగచూచి ॥ శృ ॥ ౬ ॥

గద్య

ఇతి శ్రీమద్భాగవత కృష్ణవిరచిత ద్వైతాద్వైతరహితపరమతత్త్వ
శక్తిద్వయనిరాసకంబైన శుద్ధనిర్గుణతత్త్వ కందార్థానేక
సదృష్టాంత ప్రకాశిక యందలి గురుశిష్యాన్యోన్య
దర్శనంబను ద్వితీయోధ్యాయము.